Department of
Social Service

Publication No. 18



# TRIBES & TRIBAL WELFARE

## ( TELUGU )

By

**SYED KHAJA ABDUL GAFOOR**, B. Sc., H. C. S ,

Director

Social Service Department

Govt. of Hyderabad-Dn.

1952

సాంఘిక సేవాశాఖ ప్రచురణము నెం. ౧౩

# కొండజాతులు
# వారి సంక్షేమము



గ్రంథకర్త:


సైయద్ ఖాజా అబ్దుల్ గఫూర్,

బి. ఎస్. సి., హెచ్. సి. యస్.

డైరెక్టర్,

సాంఘిక సేవా శాఖ

హైదరాబాదు ప్రభుత్వము


౧౯౫౨.

# విషయసూచిక

—— :o: ——

# FOREWORD.

Under the Directive Principles of State Policy, in articles 36 to 51 of the Constitution of India, it has been enunciated that the State shall strive to promote welfare of the people by securing and protecting as effectively as it may a social order in which justice, social, economic and political, shall inform all the institutions of the national life. The Directive Principles visualise an economic and social order based on equality of oppertunity, social justice, the right to work, the right to an adequate wage and a measure of social security for all citizens. Promotion of educational and economic intereste of Scheduled Castes, Scheduled Tribes and other weaker sections of the people and their protection from social injustice and all forms of exploitation has also been specified. In other words great stress has been laid on social welfare, which in its wider sense, comprehends all the social services and whatever may contribute to the well being of the community. Social Welfare activity actually concerns itself with the under-privileged groups, neglected areas, the vulnerable sections of the community and those who are labouring under physical or moral handicaps. Economic progress of a country does not, therefore, mean the building of an efficient apparatus for production of material goods but necessarily covers the provision of social services, the

widening of opportunities for the common man and social equality and justice.

The Backward Classes, women and children, the youth of the community, the physically handicapped, the diseased, delinquent the beggar by choice, the criminally disposed and these led into vice by force of circumstances, stand in need of treatment through expert social services.

Social Services cover all aspects of assistance to human beings whether curative or preventive and it is, therefore, not possible to define Social Service, but it can very well be described to explain the various pre-requisites of helping the individuals and societies in attaining highest stature mentally, physically, emotionally and economically. Social Services may best be described as those which grouped together in a concerted policy, help eradicate the evils of physical want, disease, ignorance, squalor and idleness.

Planning in a democratic State is a social process and essentially a way of organizing and utilizing resources to maximum advantage in terms of defined social ends.

In order to bring about a harmoneous blending of the Social Services with the anthropological Sciences, that is to say the science of

gronps of men and their behaviour and productions along with the study of MAN, particularly the primitive man, studies in physical as well as cultural anthropology were made long before any Social Welfare Scheme was drafted in Hyderabad,

One branch o the Cultural Anthropology is the Prehistoric Archaeology, which deals with the material side of the pre-historic human culture and a good deal has been done on this side by the Archaeological Department.

Studies of the aboriginals of the State in Anthropology or Somatology have not been done regularly but a good deal of work has been done on Social Anthropology by way of the study of contemporary primitive cultures and valuable Ethnographic monographs have been produced.

Culture, as we know, is the sum total of the material and itellectual equipment whereby the people satisfy their biological and social needs and adopt themselves accordingly Fundamental needs of the peoples are: (A) Primitive Needs, i, e., Hunger and Sex, (B) Derived Needs, i. e., implements and accessaries, (C) Insegrative Needs, i. e, Co-operation and Exchange of Services.

Culture is again classified as: 1. Material, and 2. Social. The study of techniques by which objects of material culture are made is called Technology and smaller objects of culture such as house, temples etc., are called Artefacts. A single item of information with regardr to either the material or the Social Culture of any people is the Culture Trait and this is the basic unit of cultural reality. Material and Social Culture are. therefore, closely linked.

With a study of Tertiary(Cenozoic), Quarternary and Holocene periods or epochs, the respective Eolithic, Paleolithic and Neolithic cultures of all human beings have been classified and similar scientific study was also undertaken in the State for the Aboriginals. With the help of these studies Schemes drafted for the tribal welfare covering all the aspects of Social Services have been implemented successfully.

An account of the social and cultural pattern of life of the Tribes in Hyderabad, and the Welfare work is given in the following pages.

It may be noted here that I have brought out several publications in English, but the long felt need of similar literature in regional

languages could not be fulfilled without the assistance and help of Shri K. Lakshmana Shastry, Assistant Director, Information and Public Relations Department. It is entirely due to his keen interest and hard labour that it has been possible for me to present this book. I acknowledge with great pleasure his assistance in this regard.

**K. A. GAFOOR,**
**Director, Social Service Dept.**
**Govt. of Hyderabad.**

---

# ఉపోద్ఘాతము

జాతీయ జీవితమునకు సంబంధించిన సంస్థలన్నింటి లోనూ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయమును కల్పించే సంఘ వ్యవస్థను సాధ్యమయినంతవరకు స్థాపించి రక్షించుట ద్వారా ప్రజా సంక్షేమమును పెంపొందించుటకు భారత దేశము ప్రయత్నించగలదని దేశీయ రాజనీతి సూత్రముల ప్రకారము ౩౮ నుండి ౫౧ వరకు గల భారత రాజ్యాంగ శాసన నిబంధనలలో నిర్ణయింపబడినది. భారతదేశ పౌరుల కందరికీ సమాన అవకాశము, సాంఘిక న్యాయము, పని చేసే హక్కు, పనికి తగిన ప్రతిఫలమును పొందేహక్కు, సాంఘిక భద్రతా ప్రమాణము ఈ మొదలైన వాటిపైన ఆధారపడియున్న ఆర్థిక సాంఘిక వ్యవస్థ రాజ్యాంగసూత్ర ములలో స్పష్టపరచబడినది. ఇంతేగాక వెనుకబడిన జాతులూ, తెగలూ, యింకా ప్రజలలో నీచస్థితిలోనున్న తెగలవారికి వైజ్ఞానిక, ఆర్థికాభివృద్ధిని కలిగించి వారికి సాంఘికంగా జరిగే అన్యాయమునుండియూ, వారిని మోస గించి స్వార్థంకొరకు అన్నివిధములా ఉపయోగించుకోవడం నుండియూ వారికి రక్షణము కల్పింపబడుతుందని కూడా రాజ్యాంగసూత్రములలో స్పష్టపరచనైనది. అనగా సాం ఘిక సంక్షేమముపై శ్రద్ధ చూపబడుతున్నది. సాంఘిక సంక్షేమమనగా అన్నివిధములైన సాంఘిక సేవలు అందులో ఇమిడియున్నవి. అది జాతి క్షేమంకొరకు ఏ సేవలైనా,

చేయగలదు. తక్కువ సౌకర్యములుగల తెగలతోనూ, నిర్లక్ష్యము చేయబడిన ప్రాంతములతోనూ, జాతిలో వెలివేయబడిన తెగలతోనూ, వికలాంగులుగానూ, వివేకశూన్యులుగాను ఉండుటచేత కాయకష్టంచేస్తూ బ్రతుకుతున్నవారితోను, ఈ సాంఘిక సంక్షేమ కార్యకలాపములు నిజమైన సంబంధము కలిగియుంటవి. కాబట్టి, స్థూలవస్తువులను ఉత్పత్తిచేసే శక్తివంతములైన సాధనములను ఏర్పరచుకోవడము చేతనే దేశీయ ఆర్థికాభివృద్ధి కలుగదు. ఐతే, నిజమైన ఆర్థికాభివృద్ధి దేనిచేత కలుగుననగా, సంఘసేవ: ప్రజాసామాన్యానికి విరివిగా సాంఘిక అవకాశములను కల్పించుట, సాంఘిక సమానత, న్యాయము; ఇవి ఉంటేనే దేశము అభివృద్ధిలో ఉన్నదని చెప్పవచ్చును.

వెనుకబడినజాతులు స్త్రీలు, శిశువులు, జాతిలోని యువకవర్గము, వికలాంగులు, రోగగ్రస్తులు, నేరస్థులైన బాలబాలికలు, బుద్ధిపూర్వకంగా బిచ్చమెత్తేవారు, అక్రమంగా అమ్మబడినవారు, అవసరములనుబట్టి విధిలేక తప్పుడుత్రోవలో నడిచేవారు, ఈ మొదలైనవారందరికీ ఉదారబుద్ధితో శ్రద్ధగాచేసే సాంఘిక సేవలద్వారా ఉపచారము చేయవలసియున్నది.

మానవమాత్రులకు అన్నివిధములైన సహాయములు చేయుటయే సాంఘికసేవ అనబడును. ఆ సహాయములు, ఆపదలు సంభవించినప్పుడు చికిత్స రూపంలోనూ, అవి

కలుగకుండానే వుండేలాగు తీసుకునే జాగ్రత్తరూపంలోనూ వుండగలవు. కాబట్టి సాంఘిక సేవ యిట్టిదని నిర్వచించుటకు సాధ్యంకాదు. అయితే మానవులు మానసికంగానూ, శారీరకంగానూ, తాత్వికంగానూ, ఆర్థికంగాను ఉత్తమస్థాయిని పొందేనిమిత్తమై వ్యక్తులకూ, సంఘములకు సహాయం చేయడానికి పూర్వాభావిగా అవసరమైన వివిధ విషయములను చాలా బాగుగా వివరించుటకు వీలుగను శారీరక అవసరాలను నిరోధించే రోగము, అజ్ఞానము, అపరిశుభ్రత, నిర్వ్యాపారంగా ఉండుట ఈ మొదలైన శక్తులను నిర్మూలిస్తూ ప్రజా సహాయము చేయుటకు సమష్టిగా సలిపే సేవయే సాంఘిక సేవ అని నిర్వచనము చెప్పవచ్చును.

ప్రజాతంత్ర రాజ్యములో నిర్ణీత పద్ధతిప్రకారం మెలగడమనేది సాంఘిక క్రమానికి దోహదం కాగలదు. ఇంతేగాక అది ముఖ్యముగా ఒక నిర్ణీతపద్ధతిలో వుండదగిన సాంఘిక వ్యవస్థలకు మిక్కిలి లాభకారిగా ఉండే ఫలములు కలుగుటకు కూడా దోహదం కాగలదు.

మానవవర్గాలూ, వారి అలవాట్లూ, మానవుని యొక్క, ముఖ్యముగా ఆదిమనివాసి యొక్క తత్వపరిశీలనతో పాటు అతడుచేసే పని ఈ మొదలగువాటిని వివరించే మానవశాస్త్రములకున్ను, సాంఘిక సేవలకున్ను సఖ్యసంబంధమును కలిగించే ఉద్దేశంతో హైదరాబాదులో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు సంబంధించిన ప్రిణాళిక ప్రవేశ

పెట్టుటకన్నా ఎంతో కాలముపూర్వమే మానవశాస్త్ర పరిశీలన శారీరకంగానూ, వైజ్ఞానికంగానూ జరుపబడినది.

పురాతన వస్తుశాస్త్రము, వైజ్ఞానిక మానవశాస్త్రముయొక్క ఒక విభాగము. ఆ శాస్త్రము పురాతన మానవ విజ్ఞానముయొక్క స్థూలస్వరూపమును వివరిస్తున్నది. ఈ స్వరూప వివరణము పురావస్తు శాఖచే చాలభాగమువరకు చేయబడినది.

మానవశాస్త్రములోనూ, మానవ శరీరశాస్త్రములోను సంస్థానములోని ఆదిమనివాసులను గూర్చిన పరిశీలన సక్రమంగా జరుపబడలేదు. అయితే వాటికి సమకాలికములైన పురాతన వైజ్ఞానిక గ్రంథముల పరిశీలనద్వారా సామాజిక మానవశాస్త్రముపై యెంతో పరిశీలన చేయడమే కాక మానవవర్గ శాస్త్రమునకు సంబంధించిన అమూల్య వ్యాసములుగూడా రచింపబడినవి.

విజ్ఞానమనగా స్థూలవస్తువులూ, బుద్ధికుశలత, ఈ రెంటి కలయిక యని మనకు తెలియును. దానితో ప్రజలు వారి జీవిత, సామాజిక అవసరములను తృప్తికరంగా తీర్చుకొని చివరకు తమంత తామే, (ఎ) ప్రాథమిక అవసరాలు, అనగా ఆహారము, స్త్రీ పురుషులు, (బి) ఉత్పన్న అవసరాలు అనగా సాధనములు, వాటి సహకారులు, (సి) నైతిక అవసరాలు, అనగా పరస్పర సహకారము, సేవ, ఈ

మూడువిధములైన ప్రజల ముఖ్యావసరములను గూడా తీర్చుకునే పద్ధతిని అవలంబించగలరు.

విజ్ఞానమనేది ౧. స్థూలవస్తురూపకము, ౨. సాంఘిక రూపకము; అని మరి రెండువిధములుగా విభజింపబడినది. స్థూలవస్తు రూపకవిజ్ఞాన విషయాలకు సంబంధించిన సాంకేతికములను తెలుసుకోవడమనేది "సాంకేతికవిద్య" అనబడును. గ్రహాములు, దేవళములు మొదలగు చిన్నచిన్న వైజ్ఞానిక విషయాలు "కళా ఖండములు" అనబడును. ప్రజల స్థూల వస్తు విజ్ఞానమునకు లేక సాంఘిక విజ్ఞానమునకు సంబంధించిన సమాచారముయొక్క ఒక అంశము "విజ్ఞాన చిహ్నము" అనబడును. ఇది వైజ్ఞానిక తత్వానికి ప్రాథమికావస్థ యగును. కాబట్టి స్థూలవస్తు, సాంఘిక విజ్ఞానములు పరస్పరం సన్నిహిత సంబంధముగలవి.

తృతీయ, చతుర్థ, సర్వేశకములను గూర్చి పరిశీలన చేయుటచేత ఆయాకాలములకు క్రమముగా సంబంధించిన ప్రాచీన ముడిపాషాణయుగము, పాషాణయుగము, తీరిన పాషాణయుగముల వివిధ మానవుల విజ్ఞానములు వేర్వేరుగా విభజించబడినవి. సంస్థానములోగూడా ఆదిమనివాసులకొరకు అటువంటి శాస్త్రీయ పరిశీలనయే చేయబడినది. ఈ పరిశీలనల సహాయంతోనే, సాంఘిక సేవలకు సంబంధించిన విషయములన్నిటినీ తెలిపే ప్రణాళికలు కొండజా

తుల సంక్షేమముకొరకు తయారుచేయబడినట్టివి జయప్రదంగా ఆచరణలోకి తీసుకరాబడినవి.

హైదరాబాదు సంస్థానములోని కొండజాతులవారి జీవనమునకు సంబంధించిన సాంఘిక వైజ్ఞానిక నమూనాను గూర్చియు, కొండజాతులవారి కొరకు అవలంబించబడిన సంక్షేమ కార్యకలాపాలను గూర్చియు ఈ గ్రంథములో వివరించబడినది.

ఈ గ్రంథమును నేను పలుసార్లు ఆంగ్లభాషలో ప్రచురించినాను. ప్రాంతీయ భాషలలోగూడా ప్రకటింపవలెనని యెంతోకాలంనుండి విచారించుచున్నాను. కాని యింతవరకు ప్రకటించ జాలకపోయితిని. అట్టి నా దీర్ఘకాలవాంఛ యిప్పుడు సమాచార, పౌరసంబంధములశాఖ, అసిస్టెంట్ డైరెక్టర్, శ్రీ కె. లక్ష్మణశాస్త్రి గారి ఉపకార సహాయములతో తెలుగుభాషలో ప్రకటించుటచే నెరవేరినది. కేవలం శ్రీ శాస్త్రి గారి నిరంతరశ్రద్ధ, బహుళ కృషివల్లనే నేను ఈ గ్రంథమును పాఠకులకు సమర్పించ గలిగినాను. ఈ విషయములో వారు నాకుచేసిన సహాయమునకు నేను కడు సంతోషములో వారికి నా కృతజ్ఞతలను తెలుపుచున్నాను.

ఇట్లు,

కె. ఎ. గఫూర్,

డైరెక్టర్, సాంఘిక సేవాశాఖ,

హైదరాబాదు ప్రభుత్వము.

# కోయలు

కోయలు ఆదిలాబాద్, కరీంనగరం, వరంగల్లు జిల్లాల లోని ముఖ్య ఆదిమనివాసులు. మనుష్యజాతి తెగలదృష్ట్యా, భాషలదృష్ట్యా కోయలు ముఖ్యమైన రెండువర్గాలుగా విభజింపబడినారు. గోండీ భాషను మాట్లాడేవారు కొంతవరకు తెలుగుతో సంబంధము గలిగియున్నారు. వీరు ఒక వర్గం వారు. మరియొక వర్గంవారు గ్రామీణ తెలుగు మాట్లాడే వారు. గోండీ మాట్లాడేవారు ముఖ్యంగా గోదావరితీరంలో ౨౦—౩౦ మైళ్ళ వైశాల్యంగల భూభాగంలో ఉన్నారు. వీరిభాష కొండజాతులవారి భాషతో సమానంగా వుంటుంది. నాగరకతకూడా వారిదే. తెలుగు మాట్లాడే కోయలకంటే వీరు చాలా భిన్నంగా ఉంటారు.

కోయలు అయిదు తరగతులలో విభజింపబడినారు:- (౧) గుట్టకోయలు. వీరు గొప్ప గౌరవమర్యాదలు గల వారు. (౨) అడ్డిలికోయలు. (౩) పెరుంబయదు. (౪) కోయ కమ్మర (కోయలలో కమ్మరపని చేసేవారు). (౫) దొల్లోలు (కోయల పురోహితులు - పూజార్లు). ఇంతేకాక రాజకోయలు, లేక రాచకోయలు, భిన్నకోయలు, అని కూడా కొన్ని భేదాలు ఆజాతిలో కలవు. తెలుగుకోయలు తమజాతిని దొర్లశతం అని అంటారు. వారిని దొరలని పిలువవలెనని వారి యిష్టము. వారు ఇతర వర్గాలవారితో వివాహ సంబంధాలు చేయరు.

బత్రాజుల వృత్తిగల ఒక జాతివారు కోయలతో దగ్గరి సంబంధం కలిగివుంటారు. వారిని గోండీభాష మాట్లాడే కోయలు పటారీలు అనీ, తెలుగుమాట్లాడే కోయలు పటారులు అనీ అంటారు. ఆ బత్రాజులు ఆదిలాబాదలోని రాజగోండుల ప్రధానులకు లేక పటారీలకు సమానంగా ఉంటారు. వారు కోయల కులదేవత (యేల్పు దేవుడు) పూజలలో ప్రధాన పాత్రను వహిస్తారు. కాని కోయలకన్నా సంఘగౌరవంలో వారు తక్కువ.

కోయలు మూఢనమ్మకము గలవారు. చెట్టు మొద్దు రూపంలోవున్న "మనిలా" అనే దేవతను వారు కొలుస్తారు. పూర్వకాలంలో వారు ఆ దేవతకు మనుష్యబలులు గూడా ఇస్తుండిరట. వారికి కొరరిరాజు అనే మరియొక దేవతకూడా వున్నది. ఇది పులి దేవతకు అధ్యక్షత వహించునట.

బాలబాలికలు సాధారణంగా బాల్యంలో వివాహం చేసుకుంటారు. ఆ తర్వాత వారు తల్లిదండ్రులతో వేరుపడుతారు. పెండ్లిండ్లు ఇష్టానుసారంగా గానీ లేక బలవంతంగా గానీ జరుగును ఇందులో తల్లి దండ్రులనూ, మగనిని విడిచి విటకాని వెంట పారిపోవడమూ. బలవంతంగా కన్యను పట్టుకొని పోవడమున్ను చేరివుంటుంది. చాలా చిన్నపిల్లలు చచ్చిపోతే పూడ్చిపెట్టుతారు. పెద్దవారైతే దహనం చేస్తారు.

పాలవంచ, బూర్గంపాడు గుట్టలు మరియు నదీప్రాంతాలలో కోయలు కొండ రెడ్లతోపాటు విజాతీయంగా కలిసి

నివసిస్తారు. కొండరెడ్లు నాగరకతలోను, విజ్ఞానంలోను, చెంచులు మొదలైన శిలాయుగపు మానవులకంటే కొంచెం ఎక్కువ దర్జాలో వుంటారు. వారిని నూతన యుగపు మానవ వర్గాలలో చేర్చవచ్చును.

అడవులలో నివసించే కోయలు యిప్పటికిన్నీ యెద్దులూ, నాగలి మొదలగు ప్రాథమిక పనిముట్లు లేకుండానే వ్యవసాయంచేసే అలవాటు గలిగియున్నారు. దానిపేరు పోడు వ్యవసాయమంటారు. వారి ప్రాత భూములు నిస్సారములైనప్పుడు క్రొత్తగా అడవులను నరికి ఆ భూములలో వ్యవసాయంచేస్తారు. అటువంటి కర్షితముగాని నూతనభూమి నుండి మంచి విలువైన పంటలను వారు పండిస్తారు. అడవులను ప్రత్యేకించి ఉంచుట, సరిహద్దులను ఏర్పరచుట, పట్టా భూమి హక్కులను ఆచరణలో పెట్టుట, భూమిని స్వాధీన పరచుకొని దానిపై స్వామ్యంకలదనే భావాన్ని పెంపొందించుట, భూమిపన్నులు వసూలుచేయుట, భూమి కావలెనని ప్రజలు ఉబలాటపడుట, ఇవన్నీ యేర్పడినందున పూర్వం భూములలో ఇష్టంవచ్చిన చోట్లనల్లా గొప్ప మొత్తంలో యిష్టంవచ్చినట్లు వ్యవసాయం చేసుకునే పద్ధతి యిప్పుడు పోయింది. అడవులలోని గహన ప్రాంతాలలో యిప్పటికిన్నీ వెనుకటి అలవాట్లను ఆచరణలో పెట్టదలచినవారై కొందరు స్వేచ్ఛగా క్రొత్త అడవులను నరికి వ్యవసాయం చేస్తారు. కాని కొనకు తత్ఫలితంగా అటవీ శాఖవారి కఠిన శిక్షకు వారు పాల్పడుదురు. ప్రత్యేకించబడిన అడవిప్రాంతాలను విడిచి

వేరే భూములలో స్థిరమైన వ్యవసాయం చేసుకోదలచుకునే వారలు గ్రామాధికారులకు వశమై వారి అనేక భూములను అధిక ధనవంతులూ, జిత్తులమారులూ నైన క్రొత్తగావచ్చిన వారి వశంచేయడం జరుగుతుంది. రవాణా సౌకర్యాలు పొందిన ప్రాంతాలలో ఈ పద్ధతి నడుస్తున్నది. ౧౯౩౯—౪౦ సంవత్సరపు భూముల మారకపు శాసనం ఈ ప్రాంతాలలో ఆలస్యంగా ఆచరణలోకి వచ్చినందువల్ల గత పది పదిహేను సంవత్సరాలలో కోయలభూములు చాలావరకు వర్తకులచేతుల్లోకి, డబ్బుపెట్టుబడిదారుల చేతుల్లోకి పోయినవని కొన్ని కోయపల్లెలలో చేసిన భూముల సమస్యా విచారణలనుబట్టి తెలుస్తున్నది.

వరంగల్లు జిల్లా కోయుల సోమరితనాన్ని విచారించి కోయులు, యితర ఆదివాసులు, వెనుకబడిన జాతులవారి సంక్షేమం నిమిత్తమై ౧౯౪౭ సంవత్సరంలో మొదటిసారిగా ఒక సాంఘికసేవా శాఖాధికారి నియమింపబడినారు. భూములు లేని అర్హులైనవారికి పట్టాపైన భూములను కేటాయించే ప్రత్యేక అధికారములు సాంఘికసేవా శాఖాధికారికి ఇవ్వనైనవి. కొండ గ్రామాలలో కోయపిల్లలను స్వతంత్రంగా బడిపంతుళ్ళనుగా నియమించే నిమిత్తమై ౧౯౪౮ సంవత్సరంలో యెల్లందు తాలూకా సుడిమెళ్ల గ్రామంలో ఒక బడిపంతుళ్ళ శిక్షణ కేంద్రం స్థాపించబడింది. గ్రామాధికార్ల స్థానాలూ, అటవీ రక్షక స్థానాలూ మొదలైనవాటి కొరకు గూడా కోయలకు శిక్షణ యివ్వబడుతున్నది. ౧౯౪౭

సంవత్సరంలో యిటువంటి శిక్షిత పంతుళ్ళు ౧౫ మంది యోగ్యత సంపాదించినవారై కొండప్రాంతాల బడిపంతుళ్ళుగా నియమింపబడినారు. ఇటువంటి కేంద్రమే మరియొకటి ములుగు తాలూకా, కామారంలో ౧౯౫౮ లో స్థాపింపబడింది. ఈ తాలూకాలో యింకా ౪ పల్లెటూరి బళ్ళు గూడా స్థాపితములై వయోజనవిద్యకు యేర్పాట్లు చేయనైనవి. శిక్షణపొందే ఉపాధ్యాయులకు నెలకు రూ ౨౦ లు స్టైపెండు యివ్వబడినది. ఇంతేకాక బడిలో చదువుకోవడానికి కావలసిన వస్తువులన్ని గూడా ఉచితంగా వారికి ఇవ్వబడినవి. ప్రతిదినం కావలసిన జీవితావసరవస్తువులు వారికి సులభంగా దొరికే నిమిత్తమున్నూ, కోయలను సహకార విజ్ఞానులనుగా చేయుటకున్నూ ఒక సరకులఅంగడి సహకార పద్ధతులపై స్థాపింపబడింది.

కోయలు, కొండరెడ్లు నివసించే గోదావరీ నదీప్రాంతాల పరిస్థితులు ఏమీ బాగాలేవు. బండ్లతోవకు అనువుగాని గనులప్రాంతములో నివసిస్తూ ఉండే ఆదివాసులు అత్యంత సాధారణమైన జీవిత అవకాశాలకు గూడా దూరం కావడమే కాకుండా మదరాసు ప్రాంతంనుండి వచ్చే కలప వర్తకుల జీతులకు లోనైపోతున్నారు. ఆ వర్తకులు వెదుళ్లు, కలపను ఇక్కడినుంచి తీసుకపోతున్నారు.

గోదావరీ ర్యాలీ, సహకార గ్రామీణ అభివృద్ధి సంఘం అనే పేరుతో ప్రభుత్వసంఘం ఒకటి కోమెడాలో

స్థాపితమైంది. ఆ సంఘం ౧౯౪౭ సహకార చట్టప్రకారం రిజిష్టరు చేయబడింది. ఈ సంఘపు ఉద్దేశాలు ఈ క్రింది విధంగా ఉన్నవి:—

(౧) సంఘసభ్యులలో మితవ్యయం, స్వయంసహాయం, సహకారం, వీటికి ప్రోత్సాహం కలిగించుట.

(౨) సభ్యులలో ఆర్థిక, సాంఘిక శ్రద్ధను పెంపొందించుట.

సంఘం ఈ క్రింది కార్యకలాపాలను చేస్తుంది:—

(౧) అడవులలో ఉత్పత్తి అయ్యే అన్ని వస్తువులకు చురుకుగా అభివృద్ధిపొందించుట.

(౨) ప్రభుత్వంనుండి, ఇతర అధికారవర్గాలనుండి గుత్తాలు తీసికొనుట.

(౩) వ్యవసాయ పంటలను, ఇతర ఉత్పత్తి వస్తువులను అమ్ముట.

(౪) ఆ ప్రాంతంలో అవసరమైన వస్తువులను, ఇంటికి పనికివచ్చే వస్తువులను సరఫరా చేయుటకై అంగళ్లు తెరచుట.

(౫) సభ్యులకు వారి అవసరాలకి మిత్తమై అప్పులిచ్చుట.

(౬) కుటీర పరిశ్రమలను ప్రవేశపెట్టి వాటిని పెంపొందించుట.

(౭) విద్య ద్వారా సాంఘిక, వైజ్ఞానిక అభివృద్ధులకొరకు సౌకర్యాలు కలిగించుట.

(౮) వైద్యసహాయం, గ్రామ పారిశుధ్యం కలిగించుట.

ఈ సంఘపు మూలధనం షేర్లు, అప్పులు, డిపాజిట్లు, విరాళాల ద్వారా పెంచవలసివచ్చింది. ఒక్కొక్క షేరు రూ ౧౦ ల పరిమాణంగా ఒక్కసారిగా గానీ, కిస్తుల ప్రకారంగాగానీ చెల్లించేవి ఒక వెయ్యి షేర్లూ, ప్రభుత్వం అడ్వాన్సుగా ఇచ్చే ఋణమూ, ఈ సంఘం తీసుకోవలసి వచ్చింది. రూ ౫,౦౦౦ వరకూ డిపాజిట్లు సభ్యులనుండి ఆశించనైంది. నిర్ణీత నియమాలప్రకారం ఏర్పడ్డ మేనేజింగు కమిటీకి పని అంతయు అప్పగించబడింది.

ఈ సంఘం కోయెడాలో ౧౯౪౭ లో స్థాపింపబడి, మార్చినెలలో పునర్వ్యవస్థీకరించబడింది. కాని అసలు పని ౧౯౪౭ ఏప్రిల్‌లో ప్రారంభమైంది.

కొయిడా గ్రామం ఒక గ్రామోద్ధరణ కేంద్రంగా కూడా ఏర్పాటు చేయబడి ఆధునిక వ్యవసాయ పద్ధతులను నేర్పుటకు సాంకేతిక నిపుణుల నియామకం కొరకూ, వ్యవసాయమును, పాడిపశువులను జాగ్రత్తగాచూడటంకొరకూ, అనారోగ్యమైన వాతావరణంగల ఈ ప్రాంతంలో తక్షణమే అవసరమైన వైద్యసహాయాన్ని ఇచ్చుటకొరకూ, కఠినమైన రవాణాలకు సౌకర్యాలు కలిగించేకొరకూ తగిన ఏర్పాట్లు చేయనైనవి. ఇంతేకాక, కొన్ని వస్తువుల సరఫరా కొరకు, ఉత్పత్తి విత్తనాల క్రియ విక్రయాలకు కూడా ఏర్పాట్లు చేయనైనవి కొండజాతులవారు చదువుకొనే నిమిత్తమై ఏకకాలంలో ౩ బడులుకూడా స్థాపించబడినవి.

ప్రస్తుతం వెదుళ్ళ నరికేపని 3 ప్రాంతాలలో చురుకుగా సాగుతున్నది. దానికొరకు కూలీల గుత్తాపై ౫౦౦ మంది కోయకార్మికులు తీసుకోబడ్డారు. రెండు సంవత్సరాల పనిలో ఖర్చులు పోగా రూ. ౧౮,౦౦౦ లాభం కలిగింది.

ఒకటి కోయెడాలోను, 3 కోయెడా పట్టీలోని ఇతర గ్రామాలలోనూ, మొత్తం నాలుగుబడులు స్థాపించబడినవి. ఆ బడులలో చదువుకొనుటకు ఉపకరణవస్తువులు ఉచితంగా ఇవ్వబడుచున్నవి. ఈ బడులన్నింటిలో దాదాపు ౮౦ మంది విద్యార్థులు చదువుకుంటున్నారు.

వరంగల్ జిల్లాలోని ఆదివాసులలో కలిగిన అసంతృప్తినీ, నిరుత్సాహాన్ని నిర్మూలించటానికీ, కోయలకు కొండరెడ్లకు సహాయంచేయటానికీ, ములుగు, నర్సంపేట, ఎల్లందు పాల్వంచ ప్రాంతాలలో కొండజాతులవారి ఉద్ధరణ కొరకై ఒక పథ్రిణాళిక ప్రవేశపెట్టబడ్డది. ప్రతి సంఘంలోను రెవిన్యూ, అటవీ, సహకార, వైద్యశాఖల అధికార్లు మరియు సహకార పునరావాస శాఖలక్రిందిఉద్యోగులు ఉన్నారు. అక్కడివివాదాలను అక్కడనే పరిష్కరించి, కష్టాలను తొలగించి, ప్రశంసనీయమైన సహాయం చేయడానికి తగిన అధికారాలు ఆ ఉద్యోగులకు ఇవ్వనైనవి. అవసరమైన ఇటువంటి కష్టనివారణ కార్యాలను జరిపేనిమిత్తమై వారికి రూ ౨ లక్షలు గ్రాంటు చేయబడ్డవి.

అడవులలోను, కొండలలోను శతాబ్దాలతరబడి ప్రత్యేకంగా ఉన్నటువంటినీ, ఇప్పటికినీ పూర్వపు ఆటవిక ఆచారాలనే అనుసరిస్తూవున్న ఆదివాసుల పరిపాలన; మిక్కిలి నాగరకత కలవారిని పరిపాలించుట కంటే, తప్పకుండా భిన్నంగా ఉంటుందనేతలంపు కలిగి ౧౯౩౫ రాజ్యాంగ చట్టంప్రకారం ఏజన్సీలు మొదట కొంత భాగములోను, తర్వాత అన్ని ప్రాంతాలలోను ఏర్పాటు చేయనైనవి. ఆదివాసుల నాగరకతకంటే, భిన్నమైన నాగరకత కలవారినుండి దూరంగా ఉన్న ఈ ప్రాంతాలలో ఆదివాసులు అభివృద్ధి కాములుగాను, ఆర్థికంగా స్వతంత్రులుగాను ఉండడమేకాక, సక్రమ పద్ధతులపై వారు గ్రామీణ స్వయంపరిపాలనను కూడా అభివృద్ధి పరచుకున్నారు. వైజ్ఞానికంగా వెనుకబడిఉన్న కొందరు కొండజాతులవారు, ఉదాహరణార్థంగా అసాములోని వారు; ఇతరగ్రామ ప్రాంతాలవారి కంటే తొలుతనే అక్షరాస్యతను సంపాదించినారు. హైదరాబాదులో కూడా ఎక్కువ సంఖ్యలో కొండజాతులవారు కల ప్రాంతాలు ఉన్నవి. వారిలో కొందరు వెంటనే మద్రాసుప్రాంతంలోని గ్రామాలలో చేరి అన్నివిధాలా అక్కడిప్రజలతో కలిసిపోయినారు. ఆదివాసులు భూమిని పోగొట్టుకోకుండా వుండడానికీ, నాగరకతజాతులవారి మోసంలో పడకుండా వుండటానికీ, వారి ఆర్థిక, విద్యా అంతస్థులను

పెంపొందించటానికిన్నీ రెవిన్యూశాఖ కొంతకాలం ఒక పద్ధతిని అనుసరించింది. అయితే, వెనుకబడిన ప్రాంతాల పరిపాలన విషయంలో సౌకర్యాలు కలిగించుటకు ఇండియాలోవున్న ప్రత్యేక నియమాలూ, శాసనాలు లేకపోవడంవల్ల అమాయకులూ, విద్యావిహీనులూ నైన ఆదివాసులకు ఆర్థికాభివృద్ధీ, న్యాయపరిపాలన చేసేపనిలో పరిపాలనాధికారులకు చిక్కులు గలుగుతున్నవి.

౧౯౪౬ సంవత్సరంలో కొండప్రాంతాల నియమావళిని తయారుచేయుటకు ప్రారంభం జరిగినప్పటికిన్నీ అది ౧౩౫౯ ఫసలీ కొండప్రాంతాల శాసనంగా ఆచరణలో పెట్టబడి దాని నియమావళి తయారుచేయనైంది. ఆదిలాబాదు, వరంగల్లు జిల్లాల కొండ ప్రాంతాలలో న్యాయస్థానాలు రద్దుచేయబడి పంచాయతులకు, సహాయ ఏజెంట్లకు (సాంఘిక సేవా శాఖాధికారులు) ఏజెంట్లకు (కలెక్టర్లు), విశేష అధికారాలు గ్రాంటు చేయబడినవి. కొండజాతులు వారని ఈ శాసనప్రవేశం, వ్యాజ్యములనుండి దూరంచేయడమేకాక కొన్ని వేళలలో వారి పూర్వాచారములకు గూడా విరోధంగా నడిచేటట్లు చేసింది.

ఈ మొదలైన సౌకర్యాలు కలిగించినప్పటి[illegible], దూరదూర ప్రాంతాలలో విడివిడిగానున్న కో[illegible] [illegible]ల్లె రస్తాలు మొదలైన సౌకర్యాలు లేకపోవడంవలన అ[illegible]

కున్నంత గొప్ప ఎత్తులో సంక్షేమ సహాయాలు వారికి చేయడం సులభసాధ్యంకాదని తలంచబడింది. కాబట్టి మూడు లేక అయిదుమైళ్ళ భూభాగంలో నివసిస్తున్న కొండజాతులవారి నందరినీ ఒకచో చేర్చి వారికి వీలైనచో ట్లల్లా రోడ్డుప్రక్కనగానీ, లేక కనీసం సమీప ప్రదేశాలలోగానీ నివాసాలుఏర్పరచటానికి అనువయ్యేలాగు కొండపల్లె లన్నింటినీ పునర్వర్గీకరణం చేయటానికి ఆలోచనలు జరుగుచున్నవి. క్రొత్తగా ఏర్పడే గ్రామాలు: ప్రజలవిహారానికి తగినంత మైదానంతోనూ, విశాలమైన రోడ్డులతోనూ కూరగాయల తోటకొరకు అనువైన దొడ్లతోనూ, ఎరువుగుంతలకు తగిన స్థలములతోనూ, ప్రత్యేకమైన పశువుల కొట్టములతోనూ, మంచినీటి బావులకొరకు తగిన ఏర్పాట్లతోను కూడిన ఆదర్శ గ్రామాలుగా ఏర్పాటు చేయుటకుగూడా నిర్ణయించనైంది. ఆ గ్రామాల సాధారణ సర్వే అయినవెంటనే అవి సౌకర్యంగావుండే తగిన చోట్లకు మార్చబడును. సాధారణపథకాలు తయారుచేయనైనవి. ౧౦౦/౧౨౦ అడుగుల ప్లాట్లు ప్రతికుటుంబానికి ఏర్పాటుచేయనైనవి. వాటిపై ౧౨/౧౦ అడుగుల జంట గుడిసెలు నమూనాలప్రకారం నిర్మింపబడును. బయలు ప్రదేశం కూరగాయల తోటకు వాడుకోబడును. గ్రామ పురోభాగంలో కావలసినంతచోటు విడువబడింది.

ప్రతిగ్రామంలోను ఒక పల్లెటూరి బడి ఏర్పాటు చేయుటకు నిర్ణయించనైందిగనుక ప్రతిచోటా ఒకగుడిసె బడికొరకు ప్రత్యేకంగా కట్టబడింది.

ఈ విధంగా ఇంతవరకు ములుగుతాలూకాలో ౬, నర్సంపేటలో ౧౦, మొల్లందులో ౯, పాల్వంచలో ౭, బూర్గంపాడులో ౨ కాలనీలు స్థాపించబడినవి. కాలనీల ప్రజలందరికిన్నీ కలప, ఇంటికప్పు సామాను ఉచితంగా ఇవ్వ బడింది. ఈవిధంగా ములుగు, నర్సంపేట తాలూకాల కాల నీలకొరకు ఇవ్వబడినకలప రు. ౪౧,౧౦౮ ల వెలగలది అని అంచనా వేయబడింది. అటవీశాఖామంత్రి గా. శ్రీ వి. బి. రాజు ఆజ్ఞప్రకారం, ఈకలప ప్రత్యేకించబడిన అడవినుండి ఇవ్వబడింది. ఈ కాలనీల నిర్మాణంలో ఆయన చాలా శ్రద్ధను మనఃపూర్వకంగా చూపించినారు. కోయల పశు వులను ఉచితంగా మేపుకునే నిమిత్తమై ఆజ్ఞయిచ్చిన శ్రీ రాజుకు కోయలుఋణపడియున్నారు. ఇంతేకాక ఆయ న లక్నవరం, రామప్ప, పాఖాల, ఈ మూడు ప్రాజక్టు ప్రాంతాలలోనూ కలపమోపులు, వంటచెరుకుమోపులు కూడా ఉచితంగా తీసుకుపోవడానికి అనుమతి ఇచ్చినారు.

## అన్ని అవసరాలకొరకు సహకారపద్ధతి ఏర్పాట్లు.

ఈ క్రొత్తకాలనీ లన్నింటిలోను ప్రజలకు దొరికే ప్రతిదిన అవసరవస్తువులకొరకు మాత్రమేకాక కొండజా

తులవారిలో సహకార పద్ధతియందు ఉత్సాహము కలిగించుటకొరకు గూడా సహకార అంగళ్ళు ఏర్పాటు చేయనైనవి. ఇనుము, సిమెంటు పంపిణీ కేంద్రాలుగా ఉండదగిన స్థలాలను ప్రకటించుటకు హైదరాబాదు వ్యావసాయక సహకార సంఘమువారు ఒప్పుకున్నారు. నిజంగా వ్యవసాయం చేసుకొనేవారికి ఇదియొక మంచి ఉపకారముగా రుజువైంది. వారి అవసరమైన వస్తువులను వారు సక్రమములూ, నిర్ణీతములూ నైన తక్కువధరలలో కొనగలగడమే కాకుండా సహకార సంఘాలకు కలిగే ఫలితాల వలనగూడా లాభం పొందగలరు. ఈ సంఘములు ప్రస్తుతం శిక్షితులైన సాంఘిక సేవాశాఖ ఉద్యోగుల అధీనంలో పనిచేస్తున్నవి. అయితే స్థానికులు, కార్యదర్శులుగానూ, కార్యాలయోద్యోగులుగానూ ఎన్నుకోబడినారు. వారు సహకార సంఘమును మొత్తం స్వతంత్రంగా నడుపుకోగలిగి ప్రస్తుత సంఘములను సకలార్థ సాధక సంఘములనుగా (మల్టీపర్పస్ సొసైటీలు) మార్చుకోగలిగినవెంటనే సంఘములకు యజమానులు కాగలరు. ఇటువంటి కేంద్రాలుగాక సాంఘిక సేవాశాఖవారిపాఠశాలలుగల కాలనీలన్నీ క్రరులు, పలుగులపంపిణీ ఉపకేంద్రాలుగా ప్రకటింపబడినవి.

## కోయరోగ నిర్మూలన.

వైద్యసహాయం చేసేనిమిత్తమై సాంఘిక సేవాశాఖ డాక్టర్లు, కోయల ఇండ్లకు నిరంతరం వెళ్ళుతున్నారు.

యాస్ (Yaws) అనే కోయరోగం సాధారణంగా కోయలకు, ఆదివాసులకు కలుగుతుంటుంది. ఆ రోగం నయమయ్యేది కాదని వారు దానితో ఊరకే బాధపడుతూ ఉంటారు. సాంఘిక సేవాశాఖ డాక్టర్లు పాటుబడి ఆ రోగం వల్ల బాధపడే ప్రతియొకనికిన్ని థియొసాక్సిన్ టీకాలు ఇస్తున్నారు. వాటివల్ల ఆ రోగాలు అద్భుతంగా నయమౌతున్నవి. ఇంతవరకు ౩,౦౦౦ టీకాలు తీయబడినవి. అన్ని కేసులు నయమైనవి. చాలా కఠినమైన కేసులు జాగ్రత్తగా పరీక్షించి బాధానివారణకు చురుకైన పద్ధతులు అవలంబించబడినవి.

గత రెండుసంవత్సరాలనుండి సాంఘిక సేవాశాఖాధికారులు కోయలకు భూములు కేటాయించేపని చేస్తున్నారు. ఈ రెండు సంవత్సరాల కాలంలో యెల్లందు, ములుగు తాలూకాలలోని ౨,౫౦౦ కుటుంబాలకు దాదాపు ౨౫,౦౦౦ యెకరాలభూమి ఇవ్వబడింది. అడవినుండి ఇంకా చాలాభూమి తీసుకొని ప్రతి కోయవానినీ కనీసం ౫ ఎకరాల భూమికైనా స్వంత పట్టేదారునుగా చేయడానికి ప్రస్తుతం ప్రయత్నాలు నూతనంగా సాగుతున్నవి. కిరాయాలపై కొనే పద్ధతిపైన దుక్కిటెద్దులను కొనే నిమిత్తమై ప్రభుత్వము తక్కావీ అప్పులనుగూడా మంజూరు చేసింది. సాంఘిక సేవా శాఖాధికారులు అవసరమున్నవారికి దుక్కిటెద్దులను పంచిపెట్టుతున్నారు. ఇకపైన పం

టలు చేతికివచ్చేవరకు తిండిగింజలు నిలువలేసి కోయవారికి సాంఘిక సేవా శాఖద్వారా ఆహారధాన్యాలు అప్పుడప్పుడు అడ్వాన్సు అప్పుగా ఇవ్వబడుతున్నవి.

సంఘసేవకొరకు కంకణంకట్టుకొనియున్న గౌ. ముఖ్యమంత్రి ౧౯౫౦ నవంబరుమాసంలో వరంగల్ జిల్లా మారుమూలప్రాంతములలో పర్యటించేటప్పుడు కోయల వెనుకబడిన పరిస్థితిని గమనించి పాఖాల, లక్నవరం, రామప్ప చెరువులక్రింది భూములను కేటాయించడానికిన్నీ, వారి పునరావాసంకొరకు అవసరమైన ఆర్థిక సహాయం చేయడానికిన్నీ నిర్ణయించినారు. కాబట్టి సదరు ప్రాజక్టుల క్రింద వుండే దాదాపు ౧౬౫౦ కోయ కుటుంబాలలో ౬౫౦ కోయలు తరిపొలాలను, మిగతావారు ఖుష్కీపొలాలను పొందగలరని సూచించనైంది. ఈ అభివృద్ధి ప్రణాళికవల్ల ౫,౦౦౦ ఎకరాల తరిపొలం, ౭౦౦౦ ఎకరాల ఖుష్కీపొలం అదనంగా వ్యవసాయంక్రిందికి తేవడమేకాక చాలా వెనుకబడియున్న కొండజాతులవారికి జీవనోపాధిని గూడా కల్పించడం జరుగుతుంది. కోయల పునరావాసానికి గౌ. ముఖ్యమంత్రి అత్యంత ప్రాముఖ్యమును ఇచ్చి ఈ మొత్తం ప్రణాళికను ఆచరణలోపెట్టుటకు రూ. ౧౩ లక్షల దయతో మంజూరుచేసినారు. వీటిలో రూ. ౧ లక్ష ౩౦,౦౦౦ లు తక్కావీ అప్పుల కొరకున్నూ, రూ. ౧,౩౭,౭౦౦ లు లక్నవరం, జూకారం, పాఖాల

ప్రాజక్టులకింద నివసిస్తూవుండే ౬౩౧ కోయకుటుంబా లకు సౌకర్యాలను కల్పించడానికిన్నీ కేటాయించబడినది.

వ్యవసాయ సౌకర్యాలు కలిగించడమేకాక కార్మిక సూత్రాల పద్ధతిపై కోయిడా సాంఘిక సేవా కేంద్రంతో చేసే అడవినరికేపనియే ములుగు, యెల్లందు, తాలూకా లలోగూడా సహకార పద్ధతులపై చేయబడుతున్నది. జిల్లాయినుండి తాడ్వాయికిపోయే రోడ్డుప్రక్కన ప్లాంట్ల ఏర్పాట్లు ములుగు సాంఘిక సేవా శాఖోద్యోగుల పర్యవే క్షణక్రింద జరుగుచున్నవి. ఇప్పుడు మాణిక్యారం, అమ్మ గారిపల్లి, బోదుపాంతాల అడవులు నరుకడానికి ప్రత్యే కించబడినవి. మాణిక్యారం అడవులు నరికేపని సాంఘిక సేవాశాఖ అడ్వాన్సుగా ఇచ్చిన రూ. ౧౦,౦౦౦ లతో ప్రారంభించబడింది. సంవత్సరం పొడుగునా కోయలకు పని కలుగడమేకాక వ్యవసాయేతర కాలంలో వారికి సహాయం కలుగుటకుగూడా, చాలినంత వ్యవసాయభూమి స్వంతంగా లేనివారికి దీనివల్ల గొప్ప సహాయం కలుగ గలదు.

నేరుగా వ్యక్తులను ప్రభుత్వ ఉద్యోగంలోకి తీసు కొనే కేసులన్నింటిలోనూ నిమ్నజాతులు, కొండజాతుల వారికొరకు, మొత్తం స్థానాలలో నూటికి ౧౨/౫ వంతులు ప్రత్యేకించబడుటయేకాక ఇటువంటి అభ్యర్థులను ఉద్యో

గంలో తీసుకొనే విషయంలో సంఖ్యానియమం ఉండబోదనికూడా హైదరాబాదు ప్రభుత్వం ౧౯౫౦ సంవత్సరంలో ఉత్తరువులు జారీచేసింది. కోయలకు ప్రభుత్వ ఉద్యోగాలు దొరకటానికి యెక్కువ సౌకర్యాలు కలిగించే నిమిత్తమై పోలీసుశాఖలో వారిని తీసుకోవడానికి స్పెషల్ కమీషనర్, వారి వయస్సులోను, శరీర పరిస్థితి వగైరాలలోను రియాయతీలు ఇచ్చినారు. ఆయన కోయలను ఉద్ధరించి బాగుపరిచే విషయంలో చాలా శ్రద్ధ చూపుతున్నారు. కాని ఆయన చూపే శ్రద్ధకు సహాయంగానూ, ప్రోత్సాహకరంగానూ కోయలను బాగుపరిచే అనేక పద్ధతులు అంత చురుకుగా ఆచరణలో పెట్టడం సాధ్యం కాలేదు.

## ఆదివాసులను యోగ్య పౌరులనుగా చేయండి.

“ఆదివాసులను దేశంలో యోగ్య పౌరులనుగా తయారుచేసే నిమిత్తమై వారినీ, వారి పరిస్థితులను బాగు పరచటానికి పాటుపడండి” అని భారత రిపబ్లిక్ అధ్యక్షుడు డా. రాజేంద్రప్రసాదు, భారతదేశంలో వున్న సాంఘిక సేవా కార్యకర్తలను సంబోధిస్తూ ఇటీవల బొంబాయిలో చెప్పినారు. ఆదివాసులకు చేసే సేవ స్వార్థ రహితంగా ఏలాటి ఉద్దేశము మనసులో పెట్టుకోకుండా చేయవలెనని ఆయన చెప్పినారు. భారతదేశంలో ఆది

వాసుల పరిస్థితి ఏమీ బాగులేదనీ, అసంఖ్యాకులైన ఆది వాసులు ఇంకా అంధకారంలోనూ, అజ్ఞానంలోనూ పడి వుండడం భారత దేశ కీర్తికి కళంకంగా వుండగలదనిన్నీ ఆయన చెప్పినారు. హైదరాబాదు సాంఘిక సేవా శాఖా మంత్రి గౌ. శ్రీ బి. రామకృష్ణారావుగూడా తాను పదవికి వచ్చినప్పటినుండి ఈ విషయమునే నొక్కి చెప్పుతున్నారు. జీవితమంతా స్వయంసంఘ సేవలో గడిపిన శ్రీ రామకృష్ణరావు, సంఘసేవను దీక్షతో చేయుమని చెప్పడంమాత్రమే కాక మనఃపూర్వకంగా ప్రజాసేవ చేసినారు. వారి సలహా, విలువైన ఉపదేశం, ప్రోత్సాహం సకాలంలో లేకపోతే ఈపని ఇంతగొప్పగా అభివృద్ధి చెందియుండదు.

---

# గోండులు

గోండులు గోండీ భాషలో 'కొయితూర్' లేక 'కోయి' అని వారిని పిలుచుకుంటారు. గోండు అను పదము యొక్క వ్యుత్పత్త్యర్థము సందేహాస్పదము. ఇది నిజంగా కొండ జాతి మనిషిని ఇతరులు పిలిచే పేరు. ౧౯౫౧ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం వారు మొత్తం భారత దేశంలో ౩౨,౦౧,౦౦౪ మంది వున్నారు. వారిలో ౨౫ లక్షల మంది మధ్య ప్రదేశంలోనే వున్నారు. గోండులు లేక రాజ గోండులు హైదరాదు ఆదివాసులలో సంఖ్యలోనూ, చారిత్రక ప్రాముఖ్యంలోను చాలా ప్రధానులుగా నున్నారు. మధ్య ప్రదేశంలోని చాందా రాజుల ప్రాచీన కుటుంబాల నుండి వచ్చినా మని గోండులు చెప్పికొనే సంతతి నుండి రాజగోండు లనే పదం పుట్టిందని స్పష్టమాతున్నది. కానీ యిప్పుడు అడవి జాతివారు ఆదివాసులు కానివారితోనూ, ఆటవికేతరమనుష్యులతోనూ మాట్లాడే అప్పుడు తాము రాజ గోండులమని చెప్పుకుంటారు. అయినప్పటికినీ, ధూర్ లేక ధూర్వేగోండులు అనబడే వారు చాలా కొద్ది మంది ఉన్నారు. వారు నాగరికత లేనివారని భావింపబడుతున్నారు. వారు రాజగోండులతో వివాహ సంబంధాలు చేసుకోజాలరు.

ప్రధానులు, తోటీలు, కోలానులు, నాయక్, పోడులు అనే వారు అదిలాబాదు గోండులతో విజాతీయంగా కలిసి నివసిస్తూంటారు. కాబట్టి వారు గోండులకు అనుబంధజాతివారు అని తప్పుగా పరిగణింపబడినారు. ప్రధానులు అనేవారు వాస్తవంగా పర్యంగా గోండులకు బటూర్జులుగా ఉండడమే కాక వారి పూర్వుల వీర గాధలను, ప్రజా సాహిత్యమును, పురాణములను, కథలను జాగ్రత్త పరిచి కాపాడే బాధ్యత గూడా వహించియుంటారు. వాటిని ఆ బటూర్జులు వంశ పరంపరగా కంఠ పాఠం చేసుకొనియుంటారు. అనేక మత కర్మలలో ఫిడీలు, కొమ్ములు వాయిస్తూ గాయకులుగా ప్రధానులు పని చేస్తారు. అయితే సంపన్నులైన గోండులకే ప్రధానులను నియమించుకోవడం సాధ్యమౌతుంది.

తోటీలు అనే వారు బటూర్జులలోను, గాయకుల లోను, ఒక తెగకు జెందినారు. వారు ప్రధానులు చేసే పనియే చేస్తూవుంటారు. సంఘగౌరవదృష్ట్యా వారు ప్రధానులకన్నా తక్కువ దర్జాలో చేరిన వారు. ప్రధానులు గోండుల నుండి బిచ్చమెత్తినట్లే తోటీలు గూడా ప్రధానుల నుండి బిచ్చమెత్తుతారు. ఈ జాతి స్త్రీలు పచ్చలు పొడుచుటలో నేర్పుకలవారు. ప్రధానులు, తోటీలు, గోండీ భాషనే మాట్లాడుతారు. గోండుల అనుబంధ తెగలో వీరు చేరినారనుటకు ఇది యొక కారణం

అయివుండవచ్చును. గోండులచేత 'మాచే' అని పిలువబడే నాయక్ పోడులు నేడు కోలానుల వలె అటవీ స్థావరాలలో ఉంటారు. పొడు పరితనంలో ఆ రెండు తెగలవారు సమానులైనప్పటికినీ వారు ఒక జాతికి చెందిన వారు కారు. వంశ పరంపరగా వారు గుట్టలపై పోడు వ్యవసాయం చేసే పద్ధతి కలవారు. కోలానులు మొదటి నుండి సహజంగా వచ్చిన వంశమర్యాదలు కలవారు. వారు వారి స్వంత భాష మాట్లాడుతారు. ప్రాచీన నాగరకతలక్షణములను వారు నిలబెట్టుకొని అనుసరిస్తున్నారు. వారి భాషలో వారిని "కోలావార్" అని పిలుచుకుంటారు. గోండులమధ్యా, కోలానులూ, నాయక్ పోడుల మధ్యా అర్థిక అంతస్థులోనే కాక మనస్తత్వంలోనూ, సాధారణ జీవనంలోనూ, చాలా భేదము కనుపడుతుంది. నాయక్ పోడులు గొడ్డు మాంసం, పంది మాంసం తినడం మానివేసినందున గోండులు, కోలానులకన్నా సాంఘిక గౌరవంలో తాము గొప్ప వారమని చెప్పుకుంటారు. అడవి ఫలాలతోను, వేళ్ళతోనూ, పారలు, గడ్డపారలతో తీయబడిన చిన్న ధాన్యంతోను ముఖ్యంగా జీవనంచేసే అతి దరిద్రుడైన నాయక్ పోడు తెగవాడు గోండుల యిండ్లలో తినుటకు నిరాకరిస్తాడు.

ఈ నాటి గోండులు, అదివాసులు, పూర్వము ఉత్తమ తరగతి రాజులు, భూస్వాముల యొక్క దర్జాను

అనుభవించినారు. వారు అధికారం వహించియున్నంత వరకు, వారి జీవిత పరిమాణము; వారి ప్రపంచవిజ్ఞానము ఏవిధంలో గూడా తక్కువస్థాయి కాదని తోచుతున్నది. గోండుల అండలో వారి దయాపాత్రులై సన్మార్గంలో నివసిస్తూవచ్చిన మతగురువులు; బటాజుల వల్ల గూడా యిది ఋజువౌతున్నది.

గోండుల చారిత్రిక సమాచారం చాల లభిస్తున్నప్పటికిన్ని అది అసంబద్ధంగాను, భిన్నంగాను ఉన్నది. గోదావరి పెన్‌గంగల మధ్యన ఉన్న పర్వత ప్రాంతముతో గూడిన గోండు వనంలో చాలా భాగం ఎల్లప్పటికిన్ని దట్టమైన అడవులతో గహనంగా వున్నది. కాబట్టి అక్కడికి పదేపదే యితరులు వెళ్ళడం తక్కువ. అయినప్పటికిన్ని ప్రాచీన ముస్లిం చరిత్ర లేఖకులు ౧౪ వ శతాబ్ది గోండు సంస్థానములను ఉల్లేఖించినారు. దేవగఢ్ సంస్థానపు ౧౭ వ శతాబ్ది రికార్డులలో దీనిని గూర్చిన ప్రత్యేక వివరములు కనుపడుచున్నవి.

నేటి అదిలాబాదు జిల్లా ప్రాంతమును చాందా రాజ్యము ఆక్రమించుకొనియుండెను. ఆ రాజ్యపు గోండులు ఆ రాజుల అధికారం క్రింద వుండిరి. మహారాష్ట్రులు మొగలులను ఓడించే వరకు గూడా మొగలుల కాలంలో గోండులు చాలా కాలం స్వతంత్రపరిపాలనను అనుభ

వించిరి. నిర్మల్ - అదిలాబాద్ రోడ్డుపైన వున్న వోడూర్ వాక్రీ కోటను ఇప్పటి గోండులకు దాదాపు ౧౫ తరము లకు ముందున్న వీరి పూర్వులు నిర్మించినారని ప్రస్తుతం ఉట్నూరులోనున్న గోండురాజు చెప్పతున్నాడు. గోండుల కోటలు, ముఖ్యంగా మాణిక్ గఢ్ కోట, ఉన్నత మైన పర్వతాగ్రంపైన కట్టబడినవి. అవి యిప్పుడు శిథిల ములై యున్నవి. ఆ దుర్గముల శిథిలములపైన పెన్‌గంగ కనుమల అరణ్యము అలముకొని యున్నది. శిథిలావస్థలో నున్న కోటలు ఇప్పటికిన్ని గోండుల పరిపాలనకు సంబం ధించిన అపూర్వములైన అనేక కథలను తెలుపుతున్నవి. చాందా పతనము తర్వాత గూడా చాలా సంవత్సరముల దాక అదిలావాద్ దుర్గమ పర్వత ప్రాంతములలో చిన్న భూభాగములు గోండు నాయకుల పరిపాలనాధికారం క్రింద ఉన్నట్లు రుజువగుచున్నది. ఇంతేకాక ఆనాయకుల పాలనలో వారి జీవితం గడచినట్లు అసంఖ్యాకములైన పురాణములు, ఇతిహాసములు, తెలుపుతున్నవి.

అద్భుతమైన యింజనీరింగు పనులతో శోభిల్లిన గోండు రాజ్యములు మంచి అభివృద్ధికరంగా ఏలబడినవి. గోండు రాజులు చేసిన మరియొక మంచి పనియేమంటే యెవరైనా చెరువు త్రవ్వితే దాని క్రింద భూమిని వానికి పన్ను లేకుండా అనుభవించడానికి యిస్తూవుండిరి. ఇట్టి ప్రోత్సా హం వుండడంవల్లనే పెన్‌గంగ కనుమలలో చిన్న చిన్న

జటాధారకములు ఎన్నో నిర్మింపబడినవి. అవి నేటికి గూడా చెడకుండా వున్నవి. శత్రువులను ఎదిరించుటకు వారికి శక్తి లేకుండెను. కాని బలహీనమైన అటవిక పద్ధతులనైన నమ్మిక కలిగియుండిరి కాబట్టి అల్లర్లు లేకుండా శాంతంగా ఉండే సమయంలో ఆ పద్ధతి చాలా అనుకూలంగా వుండెను. కాని అందరు ఏకమై ఏదైన పనిచేయవలసివచ్చినప్పుడు మాత్రం యీ పద్ధతివల్ల అందరు ఒక చోట చేరడం సాధ్యం కాకుండా వుండెను. దీని వల్ల ఏమాత్రం సంఘర్షణ లేకుండానే మహారాష్ట్రులు వీరిని సులభంగా జయించగలిగిరనేది రుజువయింది.

గోండులు ఒక ప్రత్యేక భాష, నాగరకత గలిగిన తెగవారు కాని వివిధ కులముల ప్రజలు ఒకటిగా కావడం చేత అనేక విధములైన పోలికలు వింతగా వారిలో కనుపడును. అయినప్పటికిని వారికి విశాలము, సమమైన ముఖము, ఎత్తైన చెంపల యెముకలు, చిన్నది పొట్టిదియునైన ముక్కు, చిన్న నోరు, చిన్న సోగ గడ్డము, ఇవి సాధారణంగా ఉంటవని వారి గుర్తులు చెప్పవచ్చును. సాధారణమైన పొడవు, పొట్టి ఆకారము, చామన చాయ కలవారు. గోండులు ధరించే వస్త్రములు, ఆభరణములు ఇంచుమించుగా ఆ జిల్లాలోని యితర సామాన్య ప్రజల వంటివే అని చెప్పవచ్చును. గోండు గ్రామాలలో నివసించే వృత్తి పనివారు గోండు జాతిని విడిచి యితర తక్కువ జాతులలో కలిసి పోయినారు.

గోండులలో విజాతీయ వివాహము చేసుకున్న తెగ గూడా ఒకటి ఉన్నది. సగోత్ర వివాహములను నిషేధించే పద్ధతి వీరిలో నామమాత్రావశిష్టమైయున్నది. వారి పూర్వీకునికి సంభవించినఒక సంఘటన పై వారికి గలిగిన నమ్మకం ఫలితంగా చాలా మంది మృగములయొక్క, చెట్లయొక్క పేర్లు పెట్టుకుంటారు. గోండులు వారి తెగలలో గాని, లేక వారు ఎన్ని దేవతలను పూజిస్తారో అన్ని దేవతలనే పూజించే తెగలోగాని, లేక పూజించేదేవతలసంఖ్య ప్రకారం తెగలవిభాగం గల బస్తీలో గాని పెండ్లిండ్లు చేసుకోరు. గోండుల పెండ్లిలోగల ప్రత్యేకమైన ఆచార మేమంటే సాధారణంగా పెండ్లి ఊరేగింపు పెండ్లికూతురి యింటి నుంచి బయలుదేరును. పెండ్లి కొడుకు యింటి దగ్గర పెండ్లి జరుగును. ఈ ఆచారము హిందూ ముస్లిముల వివాహాలలో లేదు. పిల్లను యెత్తుకొనిపోయి చేసుకొనే వివాహములకిది యొక గురుతు అయి యుండవచ్చును. అయిననూ, పూర్వం సంభవించిన ఒక దుస్సంఘటన వల్ల ఈ ఆచారము ఆచరణలోకి వచ్చియుండవచ్చును. ఒకప్పుడు పెండ్లికొడుకు ఊరేగుతూ పెండ్లికూతురి యింటికి పోవుచుండగా మార్గ మధ్యంలో పులివచ్చి అతనిని యెత్తుకపోయిందట. అప్పటి నుండి పెండ్లికూతురే తరలిపోవడం ఆచారమైంది. ఇంత నవీననాగరకత వచ్చి తల్లిదండ్రుల యిష్టంతో పెండ్లిడ్లు జరిగే యీ కాలంలో గూడా పిల్లను యెత్తుకొని పోయి వివాహం చేసుకోవడం యింకా ఆచారంలో వుంది. పెండ్లి చేసుకో

దలచుకున్నవాడు కొంతమంది మిత్రులను కూర్చుకొని పిల్ల కొరకు నెదిరి చూస్తూ వుంటాడు. ఆమెను పట్టుకొని లాగి నప్పుడు ఆమెకు క్రొత్త బట్టలు యివ్వబడును. మిత్రులు వెడలి పోతారు, అప్పుడు పెండ్లి అయినట్లు భావించబడును, విధవా వివాహము వీరిలో స్వేచ్ఛగా చేసుకోవచ్చును. ఈ విషయంలో చని పోయిన భర్త తమ్మునికి ప్రత్యేక అవ కాశం యివ్వబడును. అతనితో పెండ్లికి విధవ అంగీకరించక పోతే నష్టపరిహారం అడుగుటకు అతనికి హక్కు కలదు. భార్య వ్యభిచారం చేస్తే, మనస్సుకు వ్యతిరేకంగా జగడము కలిగితే, గొడ్రాలైతే, ఈ మొదలైన సందర్భాలలో విడాకు లివ్వవచ్చును. అట్టి సందర్భాలలో పంచాయితీ సభ్యులకు విందు చేయవలసి వుంటుంది. కనుక ఈ విడాకుల పద్ధతిలో చాలా ధనవ్యయము అగును. ఒక గడ్డి పోచపై ఉమ్మి వేసి దానిని త్రుంచివేసి అతని భార్యతో ఆ తర్వాతిసంబంధా లన్నీ వదలుకోవడంతో విడాకులకార్యక్రమం పూర్తి యగును. బహుభార్యాత్వమునందు ఇష్టముగలవారు ఈ పని చేస్తారు,

హిందూ మత ప్రభావము వీరిపై కలుగడం వల్ల మరణించిన వారికి దహన సంస్కారం చేయడం యిప్పుడు అలవాటైంది. పూర్వము, చచ్చిన తరువాత వీలైనప్పుడు వారిని భూమిలో పాతిపెట్టే ఆచారము సాధారణంగా ఈ జాతిలో వుండెను. వయోజనులు మరణిస్తే వారి స్మరణ

రూపంగా రోడ్డు వైపు ఒక రాయిగూడా సాధారణంగా పాతడం వుండేది. ఈ జాతివారికి పునర్జన్మలో నమ్మకం కలదు. కొన్ని సమయాలలో శవ శరీరం పై సిందూరంతో గాని లేక మసితోగాని గుర్తులు ఉంచుతారు. ఆ గుర్తులు పునర్జన్మలో అగుపడుతాయేమో చూతమని వారు తలంచి ఆలాగు చేస్తారు.

గోండులకు ఆహారనియమం లేనేలేదనవచ్చు. వారు కోళ్లు, గొడ్లు, పందులు, మొసళ్ళు, కొన్ని రకముల సర్పములు, కోతులు, ఈ మొదలైన జంతువుల మాంసము తింటారు. పొలము యెలుకలు, యెలుకలు వారికి చాలా రుచికరముగా నుండును. కాయకష్టంచేసే గోండుల ఆహారం సాధారణంగా యెలుకల అంబలిగాని లేక చిన్నధాన్యాల అంబలిగాని వుంటుంది.

విప్పపూత గూడా వారి ప్రధాన ఆహారంలో ఒక భాగమై వుంటుంది. అది విశేషంగా తినటమే కాక దాని నుండి సారాయమును గూడా తీసి త్రాగుదురు. మితిమీరి త్రాగడం గూడా వారిలో ఒక దురభ్యాసము. ఈ చెడువ్యాసనంవల్లనే తప్పకుండా వారుచాలా వెనుకబడియున్నారు. వేడుకలలోను, విందులలోను త్రాగుడు ఆవశ్యకమైనది కాని ఆసమయాలలో లేటమైన మద్యము వాడుటకలదు. గోండులు ఇతరుల చేతి ఆహారం తినరు.

గోండుల సంవత్సరము చాంద్రమాసమునకు సంబంధించి యుండును. కాబట్టి నెలలు ఇంగ్లీషు క్యాలెండరుతో నియత సంబంధము కలిగి యుండవు. ప్రతి సంవత్సరంలోనూ లోపించిన దినములను సవరించి కలుపుకునే నిమిత్తం ప్రతి మూడు సంవత్సరములకొకసారి "దోండా" అనే పద మూడవ నెల (అధికమాసము) "బుర్ భావే" తర్వాత చేర్చ బడును. హిందువుల సంవత్సరపు చైత్రశుక్ల పాడ్యమియే వారికి గూడా సంవత్సరాది అగును. ఎండ కాలము "దురారి" అనే గోండీ నెలతో ఆరంభమగును. ఎండ కాలము వ్యవసాయపు పనులు దేశంలో అంతటా ఆగిపోయినప్పటికిన్నీ గోండులు మాత్రం అలసట లేక పనిచేస్తూ వుంటారు. వారు జనపతాళ్లను పేనుతారు. నాగేళ్లను గాని లేక కొత్త మంచములను గాని తయారుచేయుదురు. లేక చిన్న ఎద్దుల జతను వెడదీసి వాటిని కాడిమానుకు కట్టి అలవాటు చేయుదురు. "దురారి" నెలపున్నముతో వారికి వ్యవసాయ సంవత్సరం యేటేటా ఆరంభించును. దురారీలో చేసే మతకర్మలు పవిత్రమైన ఉత్సవములుగా భావింపబడును. ఆ నెలలో జరిపే ఉత్సవముల వల్ల గ్రామమంతటా ఒక పండుగగా భావింపబడును. దురారీ వేడుకలు ముగియగనే గోండులు తొలుత భూమాతకు నమస్కరించి చిల్లర ధాన్యముల అన్నము, పప్పువులుసు భూమికి నైవేద్యము చేసి దున్నుటకు ఆరంభిస్తారు.

చైత్రమాసములో దున్నకపు పని, విప్పపూవు ఏరుట ప్రారంభమగును. అదే నెలలో వివాహములు, దేవతాస్థలాలయాత్రలు గూడ చేయుదురు. ఆ తర్వాతి దైన "భావే" నెలను "పెర్సా" అనిగాని లేక "పెద్ద భావే" అని గాని అంటారు. ఆ నెలలో విందులు, వేడుకలు, యాత్రలు, చేపలు పట్టుట మొదలైనవి చేస్తారు. ఇది జూన్ నెల మొదటి పక్షంలో ఆరంభమగును. అప్పుడు వర్షాకాలంగూడ వస్తుంది. వాతావరణం కుదురుకున్న వెంటనే తొలివారు నాటే సమయంలో విత్తనం జయప్రదంగా మొలిచే నిమిత్తమై రెండు కర్మలు వారు చేస్తారు. ఒకటి భూమాతకు, రెండు "అకిపెన్" అనే ఒక గ్రామదేవతకు బలియివ్వడం. ఒక్కసారి ప్రథమబీజావాపోత్సవం జరిగిందంటే గోండులు వర్షాకాలపు పైరులు బాగా పెరిగే నిమిత్తమై వారి శక్తినంతయు ధారబోయుదురు. "అకారి" నెలలో వారు జీవరాసుల క్షేమంకొరకై ప్రార్థనలు చేస్తారు. ఈ నెల ముగిసేటప్పుడు నిండు వర్షాకాలం వస్తుంది. పైర్లు పెరుగును. మొక్క జొన్న కంకులకు గింజ పట్టును. చామ పైరుకు కంకులు వచ్చును.

"పోలా" అనే నెల పున్నమకు పూర్వం అంటువ్యాధులు ఇతర రోగములు రాకుండుటకై "శివమార్కా" అనే గ్రామ పొలిమేర దేవతకు పూజలు జరుపబడును. బాలకులు, యువకులు ఊతకోలలపైనడుస్తూ వినోదములు జరుపుతారు.

"జొక్ పోక్" నెలలో (ఆగస్టు-సెప్టెంబరు) వర్షాకాలపు పైర్లు, కూరగాయలు పంటకు వచ్చును. "సావన్" నెలలో క్రొత్త పంటను తొలిసారిగా భుజించే కర్మను చేస్తారు. చిల్లర ధాన్యాల కోతపని జరిపి, మరణించినవారి ఆత్మల శాంతి కొరకు శ్రాద్ధములు జరుపుదురు.

వర్షాకాలం ముగిసేటప్పటికి "అకుర్ పోక్" నెల గూడ ముగుస్తుంది. అప్పుడు రబ్బీవిత్తనం నాటే పని "మొహతూరు" కర్మతో పాటు ప్రారంభమగును. సెప్టెంబరు—అక్టోబరు నెలలో నాటబడి చలికాలంలో పెరుగునవి తెల్లజొన్నలు, పత్తి, గోధుమలు, పప్పుధాన్యాల పైర్లు. ఇండ్లలో వాడుకునే నిమిత్తం ఆముదములు గూడా పండింపబడును. వరుసగా ఒకటి వెంట ఒక పైరు పండించడం గూడా అలవాటులోనున్నది.

దీపావళి ఆఖరు, "దండారీలకు" సంతోషకరమైన కాలము. దసరా తర్వాత రెండు మూడు వారాలదాక పల్లె ప్రాంతము లంతటా ప్రజలు ఆటపాటలలో మునిగియుంటారు. ఉత్సవములు, వేడుకలు ప్రజలందరూ చేస్తారు. ప్రతి యొకడు బాగా ఆనందిస్తాడు. అక్టోబరు-నవంబరు అనగా కార్తీక నెలలో దండారీ నాట్యములు జరుగును. గడచిన వారాలలో ఉల్లాసంగా వేడుకలు, వినోదాలు వరుసగా జరిపిన మీదట అప్పుడు గట్టి పని చేయడానికి ప్రారంభిస్తారు. పైర్లను జాగ్రత్తగా గమనిస్తూ ఉండగా నవంబరు ఆఖరు

వరకు చిల్లర ధాన్యాలు పంటకు వచ్చును. అప్పుడు ఇతర పూజలు చాలా చేసి పంటలు కోస్తారు. కార్తీక నెలవరకు వర్షాకాలపు పైర్ల కోతలు పూర్తియగును. చని పోయిన బంధువులకు బలిపూజాదులు జరుపబడును. "సతి" అనే నెలలో చిల్లర ధాన్యపు పైర్ల కోతలు, పత్తి యేరటం పూర్తి అగును. అయితే యీ పనికి పూర్వం యెట్లాంటి మత కర్మలు గూడా జరుగవు. ఈ విధంగా "పుస్" నెల (డిసెంబరు, జనవరి) వరకు వ్యవసాయపు పనులు పూర్తి యగును. ఈ విధంగా "పుస్" నెలలో అనేక కుటుంబాల వారు "పెర్సాపెన్" అనే కర్మలు చేస్తారు. ఈకర్మలు పెద్ద పెద్ద ఉత్సవాలతోనూ, "భావే" నెలలోవలె జంతుబలులు వగైరాల అమిత వ్యయంతోనూ జరుగును. ఈ నెలలోనే అదిలాబాదుకు ఆగ్నేయంగా వున్న కేసలాపూరులో ఒక గొప్ప జాతర జరుగుతుంది. గోండులు తమ బంధువులతో కలుసుకోవటానికీ, వేలకొలది ఇతర ప్రజలతో కలసి మెలసి తిరుగటానికీ ఈ జాతర సమయంలో వారికి గొప్ప అవకాశం లభిస్తుంది. ఈ సందర్భంలో వారు తమకు కావలసిన బట్టలు, నగలు చిన్న చిన్న ఆభరణములు ఇంకా అవసరమైన యితర వినోద వస్తువులు తీసుకోవడానికి అవకాశం దొరుకుతుంది.

"మాహెమాన్" (జనవరి–ఫిబ్రవరి) నెలలో చలికాలపు పైర్లన్నీ పంటకు వస్తాయి. ఆ ధాన్యములను నూర్చుకొని

వాడుకోవటానికి గానీ లేక విక్రయానికి గాని తెచ్చుకుం టారు. తిరిగి వ్యవసాయ సంవత్సరం ప్రారంభమయ్యే "దురారీ" నెలవరకు వారికి కొద్ది విశ్రాంతి లభిస్తుంది.

గోండులు వెలుపలి దేశాలలో చనువుగా వుండ లేదు. ౧౬ వ శతాబ్దినుండి అనేక అటవీ ప్రాంతాలలో యెక్కువ నాగరకతగలిగి భూమిపై ఆశగల అనేక వ్యవ సాయదారులు మెల్లగా ప్రవేశించటంవల్ల గోండులు సమ భూమి సరిహద్దులలోని పర్వత ప్రాంతాలను క్రమంగా విడిచినారు. పోడు వ్యవసాయము; పట్టాహక్కులు లేక పోవడము; వారికి ఆ భూములను స్వాధీన పరచుకొనుటకు తెలియకపోవడము, అటవీ ప్రాంతాలనిర్ణయము; ప్రత్యేకింప బడిన అడవుల ప్రకటన; అడవిలో ఉత్పత్తియైన చిన్న చిన్న వస్తువులను వేలం వేయడం; అటవీశాఖ వారి పరిపాలన దృఢపడి ఆశాఖ పరిపాలనానీతిననుసరించి అవలంబించ బడిన యింకా అనేక యితర పద్ధతులు; రవాణా సౌకర్యాలు కలిగించడము ఈ మొదలైన యేర్పాట్ల ఫలితంగా వారు స్వేచ్ఛగా అనుభవిస్తూ స్వాధీనంలో వుంచుకున్న భూము లను విడిచి పెట్టి అనేక ఆర్థిక చిక్కులకు లోనైనారు.

వారి భూములను, ఆర్థిక ఆదాయమార్గములను ఆక్ర మించుకోవడమే కాక, అటవీ ప్రాంతాలలోకి చేరుకునే ఆది వాసేతరులైన ప్రజలు కొండ జాతులవారి ఆచారములలోను, వారి జీవిత పద్ధతులలోను విశేష జోక్యం కలిగించుకొనిరి.

ఈలాటి చిక్కులు ఏర్పడినందున ఆదివాసులు, తాము హాయిగా జీవితం గడుపుకునే హక్కులకు ఆటంకములు కలిగింపబడుతున్నవని విచారపడిరి. తమ ఆర్థిక పరిస్థితి చెడుపోతున్నదనీ; ప్రభుత్వ నిబంధనలు తమ హక్కులను కాపాడుటకు బదులు వాటికి వ్యతిరేకంగా అమలు పరుపబడుతున్నవనిన్నీ వారు తెలుసుకొనిరి. వారి సాధనములు దుర్బలములై వారికి ఖానూను పరిజ్ఞానం లేనందున వారి అస్తిత్వమునకే అనేక ఇబ్బందులు కలుగుచున్నట్లు గూడా అనుభవం వల్ల వారు తెలుసుకొనిరి. ఇటువంటి తీవ్ర పరిస్థితులకారణంగా ౧౯౪౦ సంవత్సరంలో ఆదిలాబాదులో ఒక చిన్న ఆదివాసుల తెగ వృద్ధియైనది. ఈ కారణంగా కొంతమంది ఆదివాసులకు గలిగిన నష్టము వల్ల ఆ తెగ అణగి పోయింది. కాని అట్టి ఉద్ధృతపు పద్ధతుల వల్ల తప్పకుండా అపాయం కలుగుతుందని దాని వల్లతెలిసింది. హైదరాబాదు ప్రభుత్వము ఈ విషయములో ఆలస్యము చేయకుండా తొందరగా చర్య తీసుకోవడం అవసరమని తలచి ఆదిలాబాదు ఆదివాసులను ఉద్ధరించుట ఆవశ్యకమని నిర్ణయించింది. ఆదివాసులహక్కులను సంరక్షించుటకూ, ఇతరులు మోసగించి వారి భూములను ఆక్రమించకుండా ౧౯౪౩ సంవత్సరంలో ప్రత్యేకంగా ఒక కొండప్రాంతాల అధికారి నియామకం జరిగింది. ఆదిలాబాదు జిల్లా మైదానపు భూమిలో కొండజాతుల వారికి ౨౫ ఎకరాల వరకు ఖుష్కీ పొలము

పన్నులు లేకుండా యివ్వబడుతుందని ప్రకటింపబడింది. ఇంతే కాక కొండజాతులు కాని వారికి నూతన పట్టా మంజూరీలు యివ్వడం నిషేధింపబడింది.

కొండ ప్రాంతాలలో వున్న ఆదివాసులకు చదువుకునే అవకాశం లేదనీ, గ్రామీణ ప్రజలతో కలిసి యితర గ్రామాలలో నివసించే కొండజాతులవారు ఆర్థిక సాంఘిక పరిస్థితులలో చాలా తగ్గు దర్జాలో వున్నారనీ, పాఠశాలల సౌకర్యాలు సులభంగా లభించేచోట్లలో వున్నప్పటికిన్నీ వారు వాటి వల్ల లాభం పొందలేక పోతున్నారని గూడా గమనించనైంది. ఈ ఆదివాసులకు అసాధ్యమైన మరి యొక ప్రతిబంధకము గూడా వున్నది. అది భాషలో యేర్పడే చిక్కు. కాబట్టి గోండులకు ప్రాథమిక విద్య గోండీభాషలోనే వుండవలెనని తలంచి ఆదిలాబాదులో గోండు విద్యా ప్రణాళిక ఒకటి ప్రవేశపెట్టబడింది. ఈ ప్రణాలిక ప్రకారం "మార్లవాయి" శిక్షణ కేంద్రంలో గోండులు ఉపాధ్యాయులగుటకు శిక్షణం యివ్వబడుతున్నది. ఈ పాఠశాలలో చదువునేర్పే పంతుళ్ళు గోండులే. గోండీ భాష ద్వారానే విద్య నేర్పబడును. క్రమముగా తెలుగు నేర్పబడును, నేర్చుకొనేవారి శక్తినీ, వారి ప్రగతినీ బట్టి వుంటుంది. గోండీ కేవలం మాట్లాడే భాషయేకాని దానికి లిపి లేదు. ఆ భాషకు దేవనాగరిలిపి వాడబడును. ఆ లిపిలో గూడా కఠినమైన హల్లుల సంయోగములు తీసి వేసి వారికి నేర్పబడును.

గోండుల విద్యా ప్రణాళిక మొదటి ౭ సంవత్సరాలలోనే అభివృద్ధిచెందింది. ఆటవిక గ్రామాలలో ౩౦ పాఠశాలలు తెరువబడినవి. ఆ తర్వాతి సంవత్సరాలలో మహారాష్ట్ర ప్రాంతంలో గోండుల పాఠశాలల సంఖ్య ౬౯ వరకు పెరిగింది. తెలంగాణాలో నివసించే గోండుల కొరకు ౧౯౪౮ సంవత్సరంలో ఆసిఫాబాద్ తాలూకాలోని "జన్నెధారి" గ్రామంలో విద్యాసౌకర్యాలతో కూడిన ఒక ఉప కేంద్రం తెరువబడింది. తెలంగాణాలో పనిచేయుటకు ఈ కేంద్రంలో ఉపాధ్యాయులకు శిక్షణ యివ్వబడింది. నాలుగు పల్లెటూరి బళ్ళుగూడా తెరువబడినవి. చెన్నూరు, నిర్మల తాలూకాలు గాక ఆదిలాబాదు జిల్లా యితర ప్రాంతాలలో కొండ జాతులవారి పల్లెలు మొత్తం ౫౩౭ గలవు. ౨౬ మంది పంతుళ్లు గల ౬౯ బళ్ళు దాదాపు ౧౮౦ గ్రామాలకొరకు గలవు. గోండు విద్యా ప్రణాళిక క్రింద యేర్పాటైన బళ్ళు దాదాపు నూటికి ౩౫ వంతుల గ్రామాలలో చదువు నేర్పుతున్నవి. శిక్షణ సమయంలో అభ్యర్థులకు నెలకు రూ. ౩౦ లు స్టైపెండు ఒక్కొక్కరికి యివ్వడమే కాక వారికి అవసరమైన పుస్తకములు, ఇతర బడివస్తువులు ఉచితంగా యివ్వబడును. బడి పిల్లలకు కూడా పుస్తకాలు, ఇతర వస్తువులు ఉచితంగా యివ్వబడును. వాటి కొరకు సంవత్సరానికి రూ. ౩౫౦ ల గుంజాయిషీ ఉంచబడింది. కొండ జాతులవారిని తమ వృత్తులలో శ్రద్ధ గలవారినిగా

చేయుటకున్ను, వ్యవసాయంలో మంచి ఆధునిక పద్ధతులను వారికి నేర్పుటకున్ను శిక్షణ కేంద్రములలో వ్యావసాయిక ప్రదర్శనములు యేర్పాటు చేయడమేకాక కూరగాయల తోటలకూ యితర వ్యవసాయ కార్యకలాపాలకూ సంబంధించినపుస్తక పాఠాలూ అనుభవ పాఠాలు గూడా నేర్పబడుతున్నవి. ఈ పనికొరకు శిక్షితులూ, యోగ్యులూ అయిన వ్యవసాయ శాఖోద్యోగులు నియమించబడినారు.

ఆదివాసులు తమ నిత్యజీవితంలో తెలుసుకోవలసిన మరాఠీ భాషా పరిజ్ఞానము, వాడుక హిందీ భాషలో ధారాళముగా మాట్లాడుట, గోండీ యెలిమెంటరీ లెక్కలలో నైపుణ్యము, భూగోళ శాస్త్రపు సాధారణ పరిజ్ఞానము ఆరోగ్యశాస్త్ర పాఠములు, రెవిన్యూ, అటవీ శాఖల నిబంధనలకు సంబంధించిన సమాచారములు, ఈ మొదలైనవి వారికి తెలుపడమే కాక జాతీయ వీరులు, నాయకుల యొక్క ఉత్సాహజనకములైన జీవిత చరిత్రలను గూడా తెలుపడము యీ విద్యాప్రణాళిక యొక్క ముఖ్యోద్దేశము. కనుక ఇవియన్నియు పాఠ్యప్రణాళికలో చేర్చబడినవి. కొన్ని కేంద్రాలలో వ్యావసాయిక ప్రదర్శనమునకు తోడుగా వడ్రంగము ఇంకా ఇతర కళలలోనూ, అనుభవ పాఠముల శిక్షణము గూడా ఇవ్వబడుతున్నది. గోండు విద్యాప్రణాళికకొరకు సాంఘిక సేవాశాఖవారిచేత ఈ క్రింది గోండీ సాహిత్యము ప్రకటింపబడుటయేకాక వయో

జనులు చదువుకొనుటకు అనువైన పుస్తకాలు వగైరాలు గూడా సమకూర్చ బడినవి.

౧ వయోజనులకొరకు గోండీ పాఠముల పటము నెం. ౧
౨ ,, ,, ,, నెం. ౨
౩ ,, ,, ,, నెం. ౩
౪ గోండీ బాలశిక్ష.
౫ వయోజనులకు మొదటి వాచకము.
౬ పిల్లలకు ,, ,,
౭ ఇతిహాసమునకు సంబంధించిన మూడు పాటలు.
౮ అయిదుగురు సోదరుల వంశగాధ అనే మూంకోపురాణము.

గోండులకు యిష్టముగా వుండి, ఉత్సాహకరములైన ప్రజా విజ్ఞానము, పురాణములు ఇతర కథలు వగైరాలన్నిటితో వారికి పరిచయం గలిగించడానికి ప్రత్యేక ప్రయత్నాలు చేయబడుతున్నవి. ఈ సాహిత్య సేకరణ, పాఠశాలల స్థాపన, కొండజాతులవారి విజ్ఞానము స్థిరముగా నిలుచుటకు ఆధారములై యుండుటయేగాక ఉపయుక్తమైన ఆధునిక విజ్ఞానముగూడా వారిలో వ్యాపింపజేయును.

"మార్లవాయి" శిక్షణకేంద్రంలో గ్రామాధికారపదవి కొరకు గోండులకు కొందరికి శిక్షణగూడా యివ్వబడింది. ఈ విధంగా శిక్షితులైన గోండులు కొందరు ప్రభుత్వ

ఉద్యోగాలలో నియమింపబడినారు. మొత్తం దాదాపు నూటికి ౭౬ వంతుల మంది శిక్షితులు బడిపంతుళ్ళుగానూ, నూటికి ౧౬ వంతులమంది గుమాస్తాలు వగైరాలుగానూ నియమింపబడినారు. నిరుద్యోగంగా వుండేసంఖ్య నూటికి ౮ మంది.

అదే సమయంలోనే ఆదిలాబాదు జిల్లాలో ఆదివాసులకు భూములు కేటాయించేపని ౧౯౭౭ లో ప్రారంభింపబడి ౧౯౭౮ సంవత్సరం ప్రారంభం వరకు మొత్తం ౧,౩౦,౦౦౦ ఎకరాల భూమి ప్రత్యేక ఋణనిబంధనల ప్రకారం పట్టాగా వారికి ఇవ్వబడినది. ౧౯౭౯ సంవత్సరంలో ౬౦౦ ఎకరాలభూమి తమ ఖబ్జాలో ఉన్నదని చెప్పకొనుచు ఆదివాసులు గర్వించుచుండిరి. కాని ౧౯౭౬ సంవత్సరం వరకు ౧౧,౧౯౮ ఎకరాలభూమి వారి ఖబ్జాలోకి వచ్చింది. ఆదిలాబాదు గోండులలో దాదాపు నూటికి ౫౦ మందికి భూమి ఉన్నదని ఇప్పటి లెక్కలనుబట్టి స్పష్టంగా రుజువౌతున్నది.

ఆదివాసులకు పునరావాసము కల్పించి భూములు కేటాయించే ఉద్దేశము జయప్రదంగా సిద్ధించేనిమిత్తమై మహాసూరాకు వెలుపట ఉండే అడవిభూములను వారికి ఇవ్వడానికి రెవిన్యూ అధికార్లవశం చేయడమేకాక ఆదివాసుల అవసరములను సరిగా గమనించకుండా అడవుల సరిహద్దులను నిర్ణయించినచోట్లనెల్ల రిజర్వు అడవుల ప్రాంతాలను

నరికే పనికూడా జరుపబడుతున్నది. కొత్త పట్టాదార్లనుండి ఇటువంటి భూములలో వుండే కలపకు వెలను తీసుకోకూడదని కూడా ప్రభుత్వం నిర్ణయించింది. మొదట ఆదివాసుల ఖబ్జాలోవుండి తర్వాత రిజర్వు అడవిలోనూ, అడవుల సరిహద్దుల పునఃపరిష్కరణలోనూ చేర్చబడిన కొన్ని మితమైన భూభాగాలను పూర్వస్థితిలో వుంచడానికి ప్రత్యేక అధికారి ఇంకా పనిచేస్తున్నారు.

పుల్లరి పట్టీ, విప్పపూత పట్టీ, పర్క పట్టీ, చిరెంజి పట్టీ, ఇంకా అనేక యితర పట్టీలు (పన్నులు) బేఖానూనుగా గానీ, లేక అమితముగా గానీ ఆదివాసులనుండి వసూలు చేయబడినవి. న్యాయసమ్మతమైన యిట్టి కేసులలో ఫీజును సక్రమపరిచే విషయంలోగానీ లేక అవి ఖానూనుకు విరుద్ధములుగా వున్నట్లు కనబడితే వాటిని రద్దుపరిచే విషయంలో గానీ తగిన శ్రద్ధ తీసుకోబడుతున్నది.

గోండులకిచ్చిన భూములన్నీ దున్నకం క్రిందికి తెచ్చుకునేశక్తిని వారికి కల్గించే నిమిత్తమై దుక్కిటెద్దులను, ౫౦ వేల రూపాయిలను వారికి సహాయం చేయడం నిజంగా అవసరంగా వుండెను. కాబట్టి అవి ౧౯౪౭ సంవత్సరంలో మంజూరు చేయనైనవి. ఆ మంజూరు ప్రకారం ౧౬౮ మందికి అవసరమున్నవారికి ౩౭౪ దుక్కిటెద్దులను కిరాయాక్రింద కొనే పద్ధతిపై సరఫరా చేయనైనవి. ఆ మొత్తం సులభమైన కిస్తులలో తిరిగి చెల్లించదగి వుంటుంది. ఆ మొత్తంలో ౫౦

వంతులు ౩ సంవత్సరాల గడువులోనే గోండులు తిరిగి చెల్లించినారంటే యిది వారి పొదుపరితనమును రుజువు చేస్తున్నది. ఇంకా యెవరికైనా యిటువంటి అప్పులు కావలసి వుంటే అట్టివారికి కొందరికి సహాయం చేయడానికి చురుకుగా యోచనలు జరుపబడుతున్నవి.

మార్లవాయిలోని గోండు శిక్షణ కేంద్రము క్రమంగా అభివృద్ధికి తేబడుటయే కాక సహకార పద్ధతిచేతనూ, వైద్య పశువైద్య సహాయాలతోను, యింకా యిటువంటి యితర కార్యకలాపాలతోనూ కూడిన గ్రామపునరుద్ధరణ కేంద్రంగా కూడా అది పెంచబడింది.

౧౯౪౫ ఏప్రిల్ నెలలో గోండులలో సహకారసంఘ కార్యకలాపాలు ఆరంభించబడినవి. అప్పుడు మార్లవాయిలో ఒక సహకార గ్రామీణ బ్యాంకు ౨౪౨ మంది సభ్యులతో తెరువబడింది. ౫,౬౧౦ రూపాయిల వెలగల షేర్లబాబతు పైకం మొత్తం ౩౧౬ రూపాయిల ౮ అణాలు సభ్యులనుండి వసూలు చేయబడినది. జూలై నెలవరకు సభ్యులసంఖ్య ౩౯౩ దాక పెరిగి మూలధనం మొత్తం ౧,౩౫౦ రూపాయిలు చెల్లించబడింది. ప్రభుత్వమువారు ౧౦,౦౦౦ రూపాయిల మొత్తాన్ని అడ్వాన్సుగా యిచ్చినారు. ఆ మొత్తాన్ని ఇంకా రెండు గ్రామీణ బ్యాంకులు, ఒకటి మస్కాపూర్‌లోను, మరియొకటి కేసలాపూర్‌లోనూ స్థాపించటానికి వాడుకో బడింది. మార్లవాయిబ్యాంకు కార్యకలాపాలను పెంచటంతో

౧౯౪౯ సంవత్సరంలో ముల్తానీ ప్రణాళిక ద్వారా
యింకా ౮,౦౦౦ రూపాయలు అడ్వాన్సుగా యివ్వబడి
నవి. ఈ విధంగా మూలధనం పెట్టుబడి మొత్తం
౩౨,౨౦౮ రూపాయిలు అయింది. ౫ సంవత్సరాలలో
౯,౯౫౩ రూపాయిల లాభం వచ్చింది. ౧౯౫౦—౫౧
సంవత్సరంలో ఖర్చులుపోగా వచ్చినలాభం మొత్తం
౩,౮౦౩ రూపాయిలు.

౧౯౪౬ జనవరి నెలలో మన్‌కాపూర్ గ్రామీణ
బ్యాంకు ౪౫ గ్రామాలలో వున్న ౫౮౬ మంది షేరుహో
ల్డర్లతో ప్రారంభింపబడింది. ౬,౫౪౯ రూపాయిలు షేర్ల
మొత్తం క్రింద వసూలు చేయనైనవి. మార్లవాయి బ్యాంకు
నుండి ౯౪౫ రూపాయిలు అడ్వాన్సుగా ఇవ్వబడినవి.
అవి తిరిగి ఆ బ్యాంకుకు చెల్లించబడినవి. బ్యాంకులో
మొత్తం ౧౪,౬౯౮ రూపాయిల వ్యవహారం జరిగింది.
మొత్తం లాభము ౫,౦౯౫ రూపాయిలైంది.

కేసలాపూర్ గ్రామీణ బ్యాంకు ౧౯౪౬ అక్టోబరు
౬వ తారీఖున నమోదుచేయబడి ౪౨ గ్రామాలలోని
౯౪ మంది సభ్యులతో గూడియున్నది.

మన్‌కాపూర్ బ్యాంకు ౨,౪౮౦ రూపాయిలు
అడ్వాన్సుగా యిచ్చింది. చెల్లించబడిన షేర్లపైకం ౮౦౭
రూపాయిలు. ౧౯౫౦ సహకార సంవత్సరంలో
౧౦౦౨ రూపాయిల వ్యాపారం జరిగింది.

౧౯౪౮ జూలై నెలలో కేశపట్నంలో మరియొక గ్రామీణ బ్యాంకు తెరువబడింది. దానికి ౧౯ గ్రామాల లోని ౨౧౨ మంది సభ్యులు చందాదారులుగానున్నారు. దాని మూలధనం ౩,౧౩౦ రూపాయిలు. చెల్లించబడిన షేర్లపైకం ౧౭౦ రూపాయిలు. సొంత మూలధనం ౯౦౮ రూపాయిలు.

ఈ బ్యాంకు వ్యాపారం రూ. ౩౮,౮౮౯-౨-౮ లతో జరిగెను.

సభ్యులకొరకు అవసరము ఉన్నప్పుడు ధాన్యం దొరికేలాగు చేసేనిమిత్తమై ఉట్నూరు తాలూకాలో ౨౭౩౫ మంది సభ్యులతో ౭౮ ధాన్యం బ్యాంకులు తెరువబడినవి. వాటిలో నిలువ ఉన్న ధాన్యం ౧౨౨౪ పల్లాలు. ఈ ధాన్యంలోనుండి ధాన్యపు అప్పులు సభ్యులకు నూటికి ౨౫ వంతుల వడ్డీతో ఇవ్వబడినవి.

గోండుల ఉద్ధరణ కేంద్రాలుగా ఒకవైపు మార్లవాయి, రెండవవైపు జన్నెధారీ ఉన్నవి. ఈ రెంటి అభివృద్ధివల్ల మిక్కిలి సమర్థవంతమూ, అతి సులభంగా లభ్యమూ నైన వైద్యసహాయము జరిగింది. ఉట్నూరు ఆసుపత్రి చాలా దూరంగా వుండిగనుక వారికి వైద్యసహాయం సులభంగా దానివల్ల లభించదు. ఉట్నూర్, ఆసిఫాబాదుల నడుమ ఉండే ఆదివాసులకొరకు సంచార వైద్యాలయమును ఏర్పరచవలెననే సమస్య తరుచు చర్చించబడింది.

కాని సాంఘిక సేవా శాఖవారిచే నియమించబడిన హెల్తు ఇనిస్పెక్టరు మాత్రమే ఇప్పుడు పనిచేస్తున్నారు. గోండు లను విశేషంగా బాధపరుస్తూవున్న కోయ రోగమును, గజ్జిని నిర్మూలించడమే యీ ప్రాంతంలో చేయవలసిన పనులలోకెల్ల ముఖ్యమైనది.

పైన గనుపరచిన సహాయములన్ని కలిగించినప్ప టికీ గ్రామీణ ప్రజానీకపు మనస్తత్వానికి సరిగా అనుగు ణమైన పరిపాలనా యంత్రపు పునర్వ్యవస్థ కొండ ప్రాంతాలలో పూర్తిగా జరుపుటకు వీలు కాలేదని తలం చబడినది.

వారికి నష్టంలేకుండా ఎక్కువ పోడు పరితనమునకు; వివిధ సాంఘిక జీవనమునకు మార్పును కలిగించేనిమిత్తమై మ ద్రాసు; ఒరిస్సా లేక అస్సాంలోని దూరపు ప్రాంతాలపై జె న్సీప్రదేశాలతో సమానంగా ఇక్కడగూడా ఆదివాసులకు ప్రత్యేక సౌకర్యాలు కలిగించడం అవసరమని తలంచబడింది. ౧౩౫౬ ఫసలీలో కొండ ప్రాంతాల దస్తూరుల్ అమల్ (శాసనము) తయారు చేయబడింది. కాని ఆచట్టం ౧౯౫౦ సంవత్సరంలో అమలు పరుచబడింది. దీని ప్రకారం కొండప్రాంతాల నిబంధనలుగూడా తయారుచేసి ప్రవేశ పెట్టబడినవి. కొండ ప్రాంతాలలో వీటి ప్రకటనగూడా చేయబడింది. అక్కడ జిల్లా కలెక్టర్ యేజెంటుగాను, సాంఘిక సేవా శాఖాధికారి సహాయ ఏజంటుగాను అధి

కారాలు వహిస్తారు. ఈ చట్టంప్రకారం ఏజెంట్లు, సహాయఏజెంట్లు, కొండజాతులవారి కేసులవిచారణలో సివిల్, క్రిమినల్, రెవిన్యూ అధికారాలు కలిగియున్నారు.

కొండప్రాంతాల శాసనంక్రింద ఏర్పడివున్న ఏడు సివిల్ కేసులు, పది క్రిమినల్ కేసులు, ౧౮ రెవిన్యూ కేసులు యితర న్యాయస్థానాలనుండి యిక్కడికి మార్చబడినవి. ఆదిలాబాదు సహాయ ఏజెంటు న్యాయస్థానంలో ౯౫ సివిల్, ౩౮ క్రిమినల్, ౨౩ రెవిన్యూ కేసుల వ్యవహారం జరుపబడింది. మొత్తం ౧౯౧ కేసులలోనూ, ౧౩౫ కేసులలో సంవత్సరాంతంలోపుగా తీర్పు చెప్పబడినది. ఆసిఫాబాదు సహాయ ఏజెంటు న్యాయస్థానంలో ౧౫౧ కేసులు రిజిష్టర్ చేయబడి ౮౧ కేసులు తీర్పుచేయబడినవి. ఆదివాసులను ఐకమత్యంలోనూ, సమానత్వంలోను గట్టిఉత్సాహముగల సంఘాలనుగా అభివృద్ధిపరిచే నిమిత్తమై కొండప్రాంతాలలో పనిచేస్తూన్న పంచాయితీసంఘాలకుఖానూనీ మంజూరీ యివ్వబడినది. ఈ పంచాయితులకు కొండప్రాంతాల శాసనం ప్రకారం విశేష అధికారాలు ఇవ్వబడినవి. ఏడు పంచాయితీ సంఘాలు ఏర్పడినవి. వాటిచే ౧౩౦ కేసులలో తీర్పు చెప్పబడింది.

---

# చెంచులు

మహాబూబునగరంజిల్లా అమరాబాదులోని ఎగువకురువ, దిగువకురువ; ఈ రెండు చెంచులనివాసస్థానములు. ౧౯౪౧ వ సంవత్సరపు జనాభా లెక్కలప్రకారం హైదరాబాదు సంస్థానంలో చెంచుప్రజలు ౩,౯౬౫ మంది ఉండిరి. వారిలో ౩,౨౮౦ మంది మహాబూబునగరంజిల్లాలోనే వుండిరి. వారిలో దాదాపు ౫౦౦ మంది అమరాబాదు ప్రాంతపు ఎగువకురువపై యిప్పటికీ నివసిస్తూ వున్నారు. వారిని సాధారణంగా "అడవిచెంచులు" అని అంటారు. ఎగువకురుపైనవున్న అడవిచెంచులు ఇప్పటికిన్నీ యిరుగుపొరుగు గ్రామాల ప్రజలతో సంబంధంలేకుండా వున్నారు. వారు ముఖ్యంగా మంచి వేటకాండ్రు, ఆహారసంపాదనలో సమర్థులుగాను వున్నారు.

చెంచులు నల్లని వర్ణము కలవారు. వారి ఆకారము చిన్నది. పెంకెతనము, పురాతన పద్ధతులు వారి సహజ ధర్మములు. వారి వెంట్రుకలు అలలుపారి యుండును. వేట, అడవిఫలాలు, దుంపలు, ఇవియే జీవనాధారముగా గల వెడ్డిడ్ మతముయొక్క ఒక కడపటి తెగవారు. స్వతంత్ర స్వభావముగలవారు. వారు భవిష్యత్తును గూర్చి చాలాతక్కువ యోచించేవారు అనేది వారిప్రత్యేక

మనస్తత్వములలో నొకటి. భవిష్యత్తుకొరకు వస్తువులను నిలువచేసుకొనే అలవాటు వారికిలేదు. వారు సోమరులే కాక యేపనిలోగూడా అశ్రద్ధ యెక్కువకలవారు. అటవీ శాఖ పనికొరకుగాని, తామీరాత్ శాఖచే చేయబడే నిర్మాణములలో కూలినాలి చేసుకొని సంపాదించుకోవడానికి గాని వారు తమ గూడెములలోనుండి యెప్పుడూ బయటికి రారు. వారు ఒక పండుకొరకు చెట్టుకొమ్మను పూర్తిగా నరుకుతారు. చేపలు పట్టడానికి ఒక కుంటనంతటిని చెడగొట్టుతారు. అప్పుగా యిచ్చే ధనసహాయమును పొందుటకు వారు గ్రామోద్ధరణ కేంద్రానికిరారు. యాన్ని తమ ఇంటిదగ్గరకేవచ్చి చేయవలసిందని అధికారిని కోరుతారు. దేవుండ్లకొరకు ప్రత్యేకముగా దేవళములుగానీ లేక పూజాస్థలాలనుగానీ వారు నిర్మించరు. మంత్ర తంత్రములయందు విశ్వాసములేదు. వారి వివాహములు నేటి హిందూ శిష్టాచారపద్ధతి ననుసరించి యుండును.

చెంచులు ఆదివాసులందరిలోను చాల పురాతనులు మాత్రమే కాక యెవ్వరితోనూ సంబంధంలేకుండా ప్రత్యేకంగా వుండేవారైనప్పటికినీ వారు వేరే భాష మాట్లాడరు. తెలుగే మాట్లాడుతారు అనేది చాలా ఆశ్చర్యకరము. గ్రామాలలో వుండే చెంచులు యితర ప్రజలతో ధారాళంగా కలసిమెలసి వుండక, గ్రామాల వెలుపటి

ప్రదేశాలలో సొంతంగా యేర్పరుచుకున్న చిన్నచిన్న నివాసాలలో నివసిస్తూ వారి సాంఘిక ఆచారములను జాగ్రత్తగా చూచుకుంటూ వారి వాస్తవికత్వాన్ని కాపాడుకుంటారు. గ్రామంలోవున్న యితర సాధారణహిందూ ప్రజకు ఈ గ్రామీణ చెంచులకు ప్రత్యేకమైన పోలికలు గాని లేక నాగరకతలో కలయికగానీ వున్నట్లు లేదు. ఆధునిక నాగరకతకు వారు ఎంతో దగ్గరిసంబంధము కలిగియున్నప్పటికిన్ని వారు ఏ సంబంధం లేకుండా దూరంగానే వున్నారంటే ఇది చాలా ఆశ్చర్యకరంగా వున్నది. అయినప్పటికిన్ని కొంతమంది గ్రామీణచెంచులలో కొన్ని వివాహపు నడవడికలలో చాలా కొద్దిమార్పులు కనుపడుతవి. నాగరకతగల పరిసరముల ఆచారములు వారికి తెలియకుండానే వారి ఆచారములోకి వచ్చినట్లు అగుపడుతుంది. అది యేమంటే, బాల్యవివాహములు చేయడం మరియు వివాహమునకు యోగ్యమైన ముహూర్తముకొరకు బ్రాహ్మణులతో సంప్రదించడం జరుగుతున్నది.

అమరాబాదు కురువలపైనవుండే చెంచులు, కొండజాతివారు ఇతర దళిత జాతీయుల సముద్ధరణకొరకే అమరాబాదు గ్రామసంక్షేమ ప్రణాళిక ఉద్దేశింపబడినది. ఈ ప్రణాళిక ౧౯౮౨ లో ప్రవేశపెట్టబడింది. అప్పుడు అడవి చెంచులకొరకు యెగువ కురువలోనుండి ౧,౦౭,౮౫౩ ఎకరాల భూభాగం ప్రత్యేకించబడింది.

దానివల్ల వారికి కొన్ని ప్రత్యేక హక్కులు, ఇతరుల వంచననుండి రక్షణ, చాల పురాతనమైన రాతియుగం నుంచి సంస్థానంలోవున్న విశేష నాగరకజాతుల అంతస్థుకు రావడానికి యోగ్యత ఇవన్నీ కలిగినవి.

చెంచులకొరకు ప్రత్యేకంగా మంజూరుచేయబడిన సౌకర్యాలలోని కొన్ని ముఖ్యాంశాలు ఈ క్రిందివిధంగా వున్నవి.

౧. మహబూబునగరంజిల్లాలోని అమరాబాదు చెంచులకొరకు ౬౦౦౦ ఎకరాల భూభాగం "చెంచుల ప్రత్యేక భూమి" గా ఏర్పాటు చేయనైంది.

౨. ఈ ప్రత్యేక ప్రాంతంలో చెంచులు వారి పూర్వాచారములను అనుసరించవచ్చును. ఇంతేకాక బయటివారి జోక్యం ఏమాత్రం లేకుండా వేటాడుటకు, అడవిలో ఉత్పన్నములైన వస్తువులను సేకరించుకొనుటకును వారికి ఈ ప్రాంతంలో అనుమతికలదు.

౩. అడవిలో ఉత్పన్నములైన చిన్నచిన్న వస్తువులు అటవీశాఖవారిచే వేలం వేయటంలేదు. ఇంతేగాక ఒక ప్రత్యేకాధికారి పర్యవేక్షణక్రింద ఒక కొనుగోలుడిపో స్థాపితమై ఆ డిపోలో ఇటువంటి అడవి ఉత్పత్తివస్తువులు చెంచులనుండి నిర్ణీతధరపై కొనుక్కోబడును. ఆ డిపోలో వారు ధాన్యమును, ఇతర జీవితావసర వస్తువులను కొనుక్కోగలరు.

౪. చెంచు జాతిలో చేరనివారు రిజర్వ్‌తో నివాసంగ వుండటానికిన్ని, పెట్టుబడిదారులు ఆ రిజర్వులోవుండే చెంచులతో వ్యవహారం చేయటానికిన్ని అనుమతి లేదు.

౫. అడవినరికే పనికొరకు చెంచులను నియమించే అడవి గుత్తేదార్లు, నిర్ణీతమైన కూలీడబ్బును వారికి ఇవ్వవలసి వుంటుంది.

౬. పొలిమేర హద్దులలోవున్న ప్రాంతాలలో ఏవిధమైన సుంకముగాని లేక రెవిన్యూ పన్నుగాని ఇవ్వనక్కర లేకుండా చెంచులు వ్యవసాయం చేసుకోవడానికి అనుమతి కలదు. ఇంతేగాక తోటలు పెంచుకునే కార్యకలాపాలలోగూడా వారికి ప్రోత్సాహం ఇవ్వబడుతున్నది.

౭. రిజర్వ్ అడవులలో అటవీ శాఖోద్యోగులుగావుండే ఆదివాసేతరులనందరిని క్రమంగా తీయవలెనని ఉద్దేశిస్తున్న అటవీశాఖవారు ఇప్పుడు చెంచులను అడవి వాచ్‌మెన్లనుగా నియమిస్తున్నారు.

౮. చెంచులకు సక్రమ వైద్యసహాయం చేయడానికి అవకాశం కల్పించబడింది.

౯. రిజర్వ్ అడవికి వెలుపల నివసిస్తూవుండే చెంచులకు గూడా ఈ రియాయితీలలో అనేకములు అనువర్తించును. ఇంతేగాక అటవీశాఖవారిచే పని ఏర్పాటు చేయబడే ప్రత్యేక ఆటవిక గ్రామాలలో తెలుగు రైతుల గ్రామాలకు సంబంధించివుండే మజిరాలలో

వ్యావసాయిక కార్మికులుగా ప్రస్తుతం నివసిస్తున్న చెంచుల స్థిరీకరణ కొరకుగూడా యోజనలు చేయబడినవి.

౧౯౭౩ సంవత్సరంలో చెంచులకొరకు ప్రత్యేక ప్రాంత నిర్మాణసమయంలో చెంచులకు అవసరమైన సౌకర్యాలు ఏర్పాటుచేసే నిమిత్తమై అటవీశాఖవారు బాధ్యతవహించినారు. సహకార, పశువైద్య, వ్యావసాయకశాఖల యేర్పాట్లద్వారా సంక్షేమ కార్యకలాపాల అభివృద్ధిచేయబడింది. ఉచితమైన ధరలపై ప్రతిదినము అవసరమైన వస్తువులను సరఫరా చేయుటకున్నూ, అడవిలో ఉత్పత్తియైన వస్తువులను అమ్మేటకున్నూ అమ్మకములూ కొనుగోలు డిపో ఒకటి అమరాబాదు సంక్షేమ ప్రణాళికక్రింద యేర్పాటు చేయనైంది.

ప్రణాళిక కార్యకలాపాలు ఈక్రింది అంశాలతో గూడుకున్నవి:—

౧. వ్యవసాయము:- దీనిద్వారా ప్రదర్శనము, పరిహారము, చెంచులకొరకు సాముదాయిక వ్యవసాయము ఇవి జరుపబడునవి. వ్యవసాయమనేది ఒక విదేశీయ వృత్తియని భావించే చెంచులకు స్వాభావికంగా గొప్ప ప్రోత్సాహము, నిరంతరకృషి, సలహా, సహాయము, ఇవి ప్రాథమికదశలో కలిగించడం అవసరం. కాబట్టి వారికి నాగళ్లు, దుక్కిటెద్దులు, విత్తనములు, ఎరువులు, ఇంకా యితర వ్యావసాయక సహకారములు ఉచితంగా కలిగించి వారి

కొరకు సాముదాయక వ్యవసాయ వ్యవస్థ యేర్పాటు చేయనైంది. వేట, వేళ్లు త్రవ్వుకొని తీసుకోవడం మొదలైన చాల పురాతన పద్ధతులలో దాదాపు ౧౨ సంవత్సరాలకుపూర్వం జీవితం గడుపుకొంటూవుండిన అడవి చెంచులు ఇప్పుడు, సాంఘిక శాఖోద్యోగులచేత నిరంతరము చేయబడిన సక్రమ ప్రచారము, ప్రదర్శనముల ఫలితంగా వ్యవసాయంలో అత్యంత శ్రద్ధ వహించడానికి ప్రారంభించినారు. ఇంతేగాక చెంచుల "పెంటలకు" చుట్టూవుండే యోగ్యములైన భూములన్నీ దున్నకంక్రిందికి తేబడినది.

౧౫ చెంచు కుటుంబాలు సభ్యులుగా జాబితాలో చేర్చుకోబడ్డారు. ఆ సభ్యులకు ౧౫౦ ఎకరాల ప్రభుత్వ బంజరుభూమి కేటాయించబడింది. భూమి కొనుక్కోవడానికి ౫, ౦౦౦ రూపాయిలమొత్తం సభ్యులకు మంజూరు చేయబడుటయేకాక దుక్కిటెద్దులను కూడా ఉచితంగా పంచడానికి మంజూరీ ఇవ్వబడింది. ఇంతేగాక వారికి ౨, ౭౦౦ రూపాయీల తక్కావీ అప్పు సహాయం కూడా చేయబడింది. క్రమంగా భూమి ౨౫౨ ఎకరాలదాకా పెంచబడి సభ్యత్వముగూడా ౨౪ మందివరకు పెంచబడింది.

౧౯౫౦ సంవత్సరంలో సాముదాయిక వ్యవసాయం పద్ధతిపై దున్నబడిన భూమిలో పండిన వివిధ పంటలు,

వాటి అమ్మకంవల్ల వచ్చిన నగదు ఈక్రిందివిధంగా ఉన్నవి:—

| | | | |
|---|---|---|---|
| ౧. ఆముదములు | వెల | రూ. | ౬౩౮-౬-౬ |
| ౨. జొన్నలు | ,, | ,, | ౨, ౭౪౪-౦-౦ |
| ౩. సద్దలు | ,, | ,, | ౮౯౯-౦-౦ |
| ౪. ఉలువలు | ,, | ,, | ౨౩౦-౦-౦ |
| ౫. రాగులు | ,, | ,, | ౧౦౦-౦-౦ |
| ౬. వడ్లు | ,, | ,, | ౧౪౨-౦-౦ |

గత సంవత్సరపు ఫైర్లలో నువ్వులు, పొగాకుకూడా చేర్చబడినవి. ఆహారధాన్యాల విషయంలో భూమిని స్వయంసంపూర్ణంగా చేయడానికిన్ని, ఇంతదాకా అనుసరిస్తూవచ్చిన సహకార గిడ్డంగులనుండి యిచ్చే ధాన్యపు లేక నగదు అప్పుల పద్ధతినుండి సభ్యులను మాన్పించుటకున్ను కృషిచేయబడుచున్నది.

అయిదు సంవత్సరముల ఆదాయములపట్టీని పోల్చి చూచినయెడల ఆ భూమియొక్క అభివృద్ధియెంత అయినదని స్పష్టంగా తెలియగలదు.

| సం॥ | వ్యవసాయక్రిందవుండే ఎకరాలు. | ఆదాయము. |
|---|---|---|
| ౧౩౫౫-౫౬ ఫ. | ౧౪౧ | రూ. ౧, ౧౬౫-౦-౦ |
| ౧౩౫౬-౫౭ ,, | ౧౪౫ | ,, ౧, ౧౮౦-౬-౬ |
| ౧౩౫౭-౫౮ ,, | ౧౭౮ | ,, ౨, ౬౧౫-౧౩-౫ |
| ౧౩౫౮-౫౯ ,, | ౨౦౯ | ,, ౪, ౭౬౬-౬-౬ |

ఈ పరిశోలక క్రింద పనిచేసే ఉద్యోగులు దుండగుల ప్రతికూలచర్యలు ఉన్నప్పటికినీ దిగువకురువలో వుండే గ్రామాలన్నింటిలోనూ, ఎగువ కురువ పైవుండే కొన్ని గ్రామాలలోనూ పర్యటనచేసి ఈ క్రింది విషయాలలో ప్రచారము ప్రదర్శన కార్యకలాపాలు జయప్రదంగా చేయగలిగినారు.

౧. మంచి సేద్యము.
౨. వెంట వెంట పైర్లు నాటే పద్ధతి.
౩. ఎరువు మరియు ఎరువుగుంతలు.
౪. కూరగాయలు, పండ్లతోట వేయడము.
౫. తెగులుతగులకుండా ఆపుట.

౧. వ్యవసాయమునకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలుకొన్ని పుస్తకపాఠరూపంలోనూ అనుభవ పాఠరూపంలోనూ కల వ్యావసాయిక పాఠ్య భాగము మున్నూరు ప్రాథమిక పాఠశాలలో ప్రవేశపెట్టబడింది. సాంఘిక సేవాశాఖవారి కృషిద్వారా చెంచులు కొంతవరకు వ్యవసాయపుపని చేయటానికి పూనుకున్నారనేది నిజంగా సంతోషకరమైనవిషయము.

౨. సహకార కార్యకలాపాలుః- భూమిని ఉచితంగా పంచిపెట్టడంద్వారా ఆర్థిక సహాయం కలిగించడమనేది పేదతనం, నిరుద్యోగం, అనే ఈ రెండువిధములైన పిశాచాలను అణగద్రొక్కడానికి సులభోపాయమైనది.

చౌకధాన్యపుదుకాణాలు, అమ్మకం, కొనుగోలుడిపో, ధాన్యపుబ్యాంకులు, తక్కావిఅప్పుల పంపకం, ఋణాల దిద్దుబాటు వగైరాలు సహకారసంస్థక్రింద చేయబడే ముఖ్యమైన కార్యకలాపాలు.

అమరాబాదు గ్రామీణ సంక్షేమ ప్రణాళిక ప్రవేశ పెట్టుటకంటే దాదాపు ౩ సంవత్సరాలకు పూర్వము ౧౯౫౨ సంవత్సరంలో సహకారశాఖ ప్రారంభింప బడింది. మున్ననూరు, వంకేశ్వరం, ఫరహాబాదులలో స్థాపింపబడిన ౩ సహకార గిడ్డంగులు ప్రస్తుతంవున్నవి. మిదికురువమైనవుండే అడవి చెంచులకొరకు యేర్పడిన అమ్మకములు, కొనుగోలుడిపో నమూనాపై ఫరహాబాదులో ఒక గిడ్డంగి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది. చెంచులు సేకరించుకొని గిడ్డంగులకు తెచ్చిన తేనె, మైనము, కుంకుడు కాయలు, కరక్కాయలు, చారెపప్పు మొదలగు చిన్న చిన్న అటవికవస్తువులన్నీ ఈ గిడ్డంగిలో కొనుక్కోబడు తవి. గిడ్డంగినుండి వాటివెల నగదురూపంలోగాని లేక యితరవిధంలోగాని వారికి చెల్లించబడును.

గత సంవత్సరం మున్ననూరు గిడ్డంగికి ౭౨౦ రూపాయల ఆదాయంవచ్చింది. అనగా ౬ సంవత్సరము లకు పూర్వంవున్న ఆదాయంకంటె గత సంవత్సరం నూటికి ౬ వంతులు అధికంగా పెరిగిందన్నమాట.

వంకేశ్వరం గిడ్డంగి ౧౩౫౬ ఫసలీలో ఆరంభింపబడి ఇప్పుడు క్రమాభివృద్ధి నందుచున్నది.

చౌకధరల దుకాణాలు ఆహారధాన్యాలను నిలువచేసి చెంచులకు, ఇతర నిమ్నజాతులవారికి వాటిని పంచిపెట్టుతున్నవి. ఈ సంవత్సరం ఈ దుకాణాలకు ఖర్చులు పోగా వచ్చినలాభం ౩౪౭ రూపాయలు.

సాహుకార్లకు చెంచులివ్వవలసిన అప్పులను పూర్తిగా తీర్చివేసేనిమిత్తమై ౧౯౪౬ వ సంవత్సరంలో చెంచులకు ౩,౧౫౨ రూపాయలు పంచనైనవి. ఈమొత్తం పైకంగూడా కిస్తులపైన తిరిగి చెల్లించదగిందిగా వుంటుంది. మితిమీరిన అన్యాయ వడ్డీలపైన తెచ్చిన అప్పులను తీర్చేనిమిత్తమై చెంచులకు అప్పులుగా ఇవ్వబడిన ౩,౧౫౨ రూపాయిలలో ౧౦౩౫-౬-౪ రూపాయలను ఇంతవరకు తిరిగి వారు తీర్చినారు. ఈ అప్పులు పుచ్చుకున్న చెంచులలో చాలామందికి ఒక నికరమైన ఆదాయమార్గము లేకపోవడమేకాకుండా వారు సంపాదించే ఆదాయంలో మిగిలేదికూడా నిజంగా ఏమీలేనందువల్లనే అప్పులు తీర్చడంలో వారికి ఆలస్యమౌతున్నది. అడవిలో ఉత్పత్తియైన చిన్నచిన్న వస్తువులను అమ్మడంవల్లవచ్చే ఆదాయంచేతనే వారు కొన్ని అప్పులను తీర్చగలుగుతున్నారు.

౩. పశువైద్యము:- పశువైద్య ఆసుపత్రి లంబాడా పశు ఉత్పత్తి కేంద్రపు అధికారనిర్వహణ, అడవి చెంచు

లకు దున్నపోతులను పంచడం, గ్రామాలలో పశుసంప దను ఉత్పత్తిచేసే నిమిత్తమై యెద్దులను ఉంచుట, పశువులకు తెగుళ్లు రాకుండా అప్రటకు వచ్చినవాటిని నయంచేయుటకు తగిన చర్యలను తీసుకొనుట, ఈ మొదలైనవాటితో కూడిన కార్యకలాపాలు ఈ శాఖద్వారా జరుపబడుతున్నవి.

పెంపుడుకోళ్ళ నన్నింటినీ పిల్లులు, అడవి జంతు వులు యెత్తుకొనిపోయినవి. ఈ ఉపద్రవము కలిగినందువల్ల, చెంచులకు కోళ్ళను పెంచే అలవాటు కలిగింపవలెనని పశు వైద్యశాఖవారు చేసే కృషికి భంగం కలిగింది. చెంచులకు వుండే ఊరూరు తిరిగే అలవాటు, చాలా మంచి పచ్చిక బయళ్లు వారికి సమీపంలో ఉండడము, ఈ రెండు అంశా లున్ను వారిని పశువులను ఉత్పత్తిచేయుటకు సమర్థులనుగా చేసినవి.

సొంతంగా పశువులులేకుండా పశువులు కావలెనని కోరే చెంచులకు దున్నపోతులను, ఎద్దులను ఉచితంగా పంచిపెట్టేనిమిత్తమై ప్రతిసంవత్సరం కొంత నగదుగుం జాయిషీ ఏర్పాటు చేయనైంది.

పశువైద్య శాఖాధికారి గ్రామాలలో పర్యటన చేస్తూ, అవసరమైన సలహాలను ఇస్తూ, పశువులను జాగ్ర త్తగా పోషించడాన్నిగూర్చి, పశువుల ఉత్పత్తినిగూర్చి, కోళ్ళను పెంచేవిషయాన్నిగూర్చి, తెగుళ్లు, అంటురోగాలు వగైరాల ఆపదలనుగూర్చిన్ని పరిసంగిస్తూ ఉంటారు.

౩. వైద్య సహాయము:- ఈ కొండజాతివారిలో వ్యాపించిన రోగాలను నయంచేయడానికీ, వాటిని ఆపడానికీ సాధ్యమైనన్ని మార్గాలన్నిటిలోను కృషిచేసి వారికి వైద్యసహాయము కలిగించబడుతున్నది. దూరగ్రామాల నుండికూడ ఎంతోమంది రోగులను మన్ననూరు ఆసుపత్రి ఆకర్షిస్తున్నది. సంచార ఆసుపత్రి మారుమూలగ్రామాలలోవున్న రోగులకు చికిత్సచేస్తూ అంటురోగాలు వగైరాలను నయంచేయడం, ఆపడం మొదలైన విషయాలను గూర్చిన విలువైన ప్రచారకార్యక్రమాన్నికూడా చేస్తున్నది.

౪. విద్య:- పూర్వం 'నిమ్నజాతులపిల్లల పాఠశాల' అని పిలువబడుతూవుండే ప్రస్తుతపు మన్ననూరు ప్రాథమిక పాఠశాలలో చాలామంది చెంచుపిల్లలు చేరినారు, ఆ పాఠశాలలో తెనుగుభాషద్వారా విద్య నేర్పబడుతున్నది. వ్యవసాయ, పశువైద్యములకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలను నేర్పడానికి ఏర్పాటుచేసిన సహకార తరగతులతోపాటు ఇతర పాఠశాలలలో అనుసరించే సాధారణ పాఠ్యప్రణాళికకూడా ఈ పాఠశాలలో అనుసరింపబడుతున్నది. అటవీ, రెవిన్యూ, ఆబ్కారీ శాఖలకు సంబంధించిన ముఖ్య నియమాలు మాత్రమేకాక పౌరసత్వానికి సంబంధించిన ప్రాతిపదిక సూత్రాలు గూడా వారికి నేర్పబడుతున్నవి. పుస్తకములు, చదువు

కోవడానికి కావలసిన ఇతర సామగ్రి విద్యార్థులకు ఉచితంగా సరఫరా చేయబడుతున్నవి. మధ్యాహ్న భోజనం వారికి పెట్టబడుతున్నది. బడిపిల్లల శరీరారోగ్యాన్ని ప్రత్యేక శ్రద్ధతో చూస్తూ వారికి వైద్యసహాయం ఇవ్వబడుతున్నది.

చెంచుపిల్లలు చాలామంది, ముఖ్యంగా ఆడపిల్లలు, చదువుకోవడానికి యెక్కువ అభిరుచిని చూపించడమే కాక చెంచుపిల్లవాడే పరీక్షలో తరగతిలో కెల్ల మొదటివాడుగా నెగ్గుతున్నాడని కూడా తెలుసుకోవడం చాలా ఆశ్చర్యకరంగా వున్నది. ఉన్నతజాతులవారిపిల్లలు, ఇతరులకన్నా ఎక్కువ అభ్యున్నతిని పొందిన తెగలవారి పిల్లలతో సహా అనేక తెగలవిద్యార్థులు చదువుకునే ఒక పాఠశాలలో చాలా పురాతనమైన కొండజాతులపిల్లలు చదువులో అత్యుత్తమమైన పరీక్షాఫలితాలను కనుపరుస్తున్నారంటే ఇది చాలా సంతోషాన్ని ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. అభివృద్ధికివచ్చి నాగరకతగల ఏ యితరజాతికి సంబంధించిన పిల్లవానికంటేగూడా చెంచుపిల్లల బుద్ధిసూక్ష్మత, గ్రహణశక్తి ఏవిధంగాగూడా తక్కువదర్జాదికాదని విద్యార్థుల ప్రగతిపట్టీనుండి తేలిన అంశంవల్ల స్పష్టమౌతున్నది.

నిమ్నజాతులవారి ప్రాంతాల (బి. వి. భాగపు స్టేట్ల్స్)౧౯౫౦ సం॥పు చట్టంప్రకారం చెంచులునివసించే

ప్రాంతాలన్నీ నిమ్నజాతులవారి ప్రాంతాలుగా ప్రకటించబడినది.

చెంచులనూ, ఇతర వెనుకబడిన జాతులవారిని బాగు పరిచే నిమిత్తమై ప్రతిసంవత్సరం ౪౭, ౯౬౫ రూపాయల మొత్తం ఖర్చుపెట్టబడుతున్నది. ఎగువకురువపై ఒక పునరావాస కేంద్రాన్ని తెరువడానికి సూచనలు ప్రస్తుతం విచారింపబడుతున్నవి.

---

# లంబాడాలు

భారతదేశములో అంతటా కనబడే లంబాడాలు లేక బంజారాలు ఇండియాలోని యితర యే ప్రాంతంలోకన్నా హైదరాబాదు సంస్థానంలో ఎక్కువ సంఖ్యలో నున్నారు. వారు దక్కన్‌సీమ సహజ ఆకార లక్షణములతో కూడియున్నారు. వారి నివాసదేశము ఉత్తర హిందూస్థానములో (సాధారణంగా రాజపుత్రస్థానంలో) ఉన్నదనుటలో సందేహంలేదు. మొగలు చక్రవర్తులు దేశమును జయించిన కాలంలో వర్తకులుగా లంబాడాలు దక్కన్‌లోకి వచ్చినారు. వారిని బ్రింజారులు, గోహార్లు, హర్కారాలు, లామనెలు అని కూడా అంటారు.

లంబాడీ అనే పేరు 'లవణ' (ఉప్పు) అనే పదంనుండి బ్రింజారీ (లేక బంజారా) అనే పేరు 'బనిజార్' (వర్తకులు) అనే పదంనుండి ఉత్పన్నములైనవి. వారి బరువులు మోసే యెద్దుల పెద్దపెద్ద మందలు ఇండియాలో కల్లోలములు గలిగినపుడు అనేక శతాబ్దులలో సైన్యముల రవాణాకు ఉపయోగిస్తుండెను. దూరప్రాంతాలనుండి ధాన్యమునూ, వస్త్రములను తీసుకొనిపోయి యుద్ధసైనికులకు అందజేయడం ద్వారా వారు ఒక విధమైన అనధికార సైనిక ఆహారదాతలుగా వుండిరి. లంబాడీలు సముద్రమునకు దూరమందున్న దేశమధ్యమునుండి ధాన్యములనూ, సముద్రతీరమునుండి

ఉప్పును తీసుకొని పోవుచుండిరని గూడా రికార్డులవల్ల స్పష్ట మగుచున్నది. బంజారాలు ఇతర వర్తకసామగ్రి, కొన్ని వేళలలో సిపాయిల సామానుగూడా మోసుకొని పోయి నారు. వేగంగా పోయే రవాణా సౌకర్యాలు రావడంతో వారి వర్తకానికి భంగం కలుగడమేకాక రాకపోకల సౌక ర్యాందృష్ట్యా ఎక్కువ అభివృద్ధి పొందని ప్రాంతాలలోనే వారికి తిరుగవలసివచ్చెను. నేటికాలంలో గూడా ధాన్యమును మోస్తూండే యెద్దులతోపాటు ఒక విచిత్రమైన లంబాడీల గుంపును సంస్థానంలోని కొన్నిప్రాంతాలలో చూడవచ్చును. దేశంలోని ఇతర ప్రాంతాలలో గూడా, యెక్కడ వీలైతే అక్కడ, తగిన స్థలాలలో వారు నివాసం యేర్పరచుకొని కొండప్రాంతాలలో బరువును మోసుకొని పోవడానికి ఉప యోగించే యెద్దులను పెంచినారు. వారికి భూములు చాలా ఆలస్యంగా దొరికినందువల్ల వారు వ్యవసాయాన్ని తమ వృత్తిగా చేసుకోలేకపోయినారు. మోటు జీవితంనుండి లంబాడీలు వ్యవసాయం కొరకూ, యితర జీవనోపాధుల కొరకు ఊరూరు తిరిగే వర్తకజీవితానికి మారే సమయంలో నేరములుకూడా చేసి కొన్ని చోట్లలో 'క్రిమినల్ ట్రైబ్సు' శాసనంక్రింద నేరస్థులుగా వీరు ప్రకటింపబడినారు. ఇప్పుడు ఆ శాసనం రద్దుచేయబడింది. వారుచేసే నేరములు చాలా వరకు అణచబడినవి. అయినప్పటికిన్ని మద్యము తయారు చేసే నేరము మాత్రం ఇంకా వారిని విడువకుండా పట్టు

కొనీ యున్నది. వారు ఎల్లప్పటికిన్ని ఖానూనుకు విరోధంగా సారాయిని బట్టీలలో తయారుచేస్తుంటారు.

బంజారాలు దృఢకాయులు. వారిది పౌరుషవంతమైన జాతి. పొడవైన ఆకారము, అందమైన శరీరచర్మము, ప్రకాశవంతమైన కన్నులు కలవారు. ఆయుధములు ప్రయోగించుటలో వారు సమర్థులు. చంచలమైన సాహస జీవితానికి అలవాటుపడినవారు. నాగరకతలోనూ, శరీర ఆకృతిలోనూ మాధూరాలతో సమానంగా వుంటారు. పురుషులు, తెలంగాణా ప్రాంతపు దుస్తులను ధరిస్తారు. కాని స్త్రీలు ఆకర్షణీయములూ, బరువుగలవియూ నగు రంగురంగుల ఆభరణములు ధరించే ఆచారమును నేటిదాకా గూడా విడువలేదు. కొమ్ముతో చేసిన గాజులు, విచిత్ర ఆకారము గల అందెలు, గురికీలు, ఈ మొదలైనవారి ఆభరణములు బరువుగానూ, ఆకర్షణీయంగానూ, వారి ప్రత్యేక లక్షణమును తెలిపేవిగాను ఉంటవి. బంజారాస్త్రీలు జబ్బుగానూ, విచారంతోనూ వుండడం చాలా అరుదు. వారు కష్టపడి పనిచేసేవారు. దృఢకాయం కలవారు మాత్రమేకాక యెల్లప్పటికిన్ని ధైర్య సంతోషములతో కళకళ లాడుతుంటారు. ఉల్లాసముగానూ, అందముగాను ఆడుతూ పాడుతూ వుంటారు. పాటలు వారి లంబాడీ భాషలోనే వుంటవి. విశేషంగా ఆ పాటలు గోపాలకృష్ణుని స్తోత్రరూపంగా వుంటవి.

వారికి శాశ్వతమైన నివాస స్థానములు ఉండవు. ఎప్పుడూ సంచారజీవితాన్ని గడుపుతుంటారు. "తాండా" అనబడే వారి సొంత సంఘములోనే వారు జీవితం గడుపుతారు. ఇతర జాతులవారితో కలిసి వుండరు. ప్రతితాండాకును వంశపరంపరగా వస్తున్న ఒక నాయకుడు ఉంటాడు. ఆయనకు బదులు చెప్పకుండా అందరు చాల విధేయులై వుంటారు. వారి సొంతభాషనే నేటివరకు వారు మాట్లాడుతుంటారు. కాబట్టి వారు ప్రత్యేక కొండజాతిగా విభజింపబడినారు. వారి పశువులను జాగ్రత్తతో వారు కాపాడుకుంటూ వుంటారు. మహబూబునగరం జిల్లాలోని అమరాబాద్ కురువపైన స్థానికంగా "అమరాబాద్ పశువులు" అనబడే ఒక ప్రత్యేక పశువుల తెగను వారు ఉత్పత్తి చేయిస్తున్నారు. మేత చిక్కని కాలంలో పశువులను మేపుటకై సాధారణంగా వారు సమప్రాంతాలనుండి వాటిని కురువపైకి మాత్రమే కాక యింకా యెత్తైన ఫరహాబాదు కురువపైకి గూడా తెస్తారు. ఈ వ్యాపారంలో వారు చాలా నీతిపరులుగా వుంటారని ప్రసిద్ధి. సమప్రాంతాలలో వున్న వారినుండి వారికి మంచి ప్రతిఫలం దొరుకుతుందని వారి పశు సంపదవల్లనే మనకు స్పష్టంగా తెలియగలదు.

వారు విశ్వాసపూర్వకంగా చెప్పుకునే సర్వజన సాధారణమైన కథలో చెప్పినప్రకారంగా లంబాడీజాతి మూలము ఈ క్రిందివిధంగా ఉన్నది:—

భగవంతుడైన కృష్ణుడు తన అవతారాన్ని ముగించే సమయంలో తన భక్తులనందరినీ పిలిచి గోపికలను వారికి పంచియిచ్చి రాధనూ, రుక్మిణినిమాత్రం మోలా, మోటా అనేవారికొరకు ఉంచినాడు. వారిద్దరు కృష్ణభగవానునికి విశ్వాసపాత్రులూ, విధేయులు నైన భక్తులుగా నుండిరి. ఈ విషయం జరిగినప్పుడు మోలా అక్కడ లేకుండెను. గోపికలను పంచేటప్పుడు తనను గమనించలేదని మోలా తెలుసుకొని చాలా విచారించెను. శ్రీకృష్ణుడు మోలా విచారమునుచూచి నవ్వి అతనికి రాధను ఇచ్చెను.

మోలా రాధలు నటకులైరి. ఆతర్వాత దొమ్మరివాండ్లుగా అయిరి. వారిద్దరు తమ నాట్యకళను, నేర్పును ప్రదర్శిస్తూ క్రమంగా ఒక్కొక్క పట్టణమునకు వెళ్ళిరి. ఒకప్పుడు వారిద్దరూ రాథోడు రాజు, ఫలియా అనే మారు పేరుగల రాజా చతుర్భుజుని దర్శించి వారి నాట్యమును ప్రదర్శించిరి. ఆ నాట్యమును చూచి రాజు చాలా సంతోషించి వారి తృప్తి దీరేటట్లు కోరిన బహుమతి ఇవ్వదలచెను. మోలా రాధలకు సంతతిలేనందుచేత రాజు కొడుకును తమకు దత్తపుత్రునిగా ఇమ్మని వారు కోరిరి. రాజు వారి కోరికను చెల్లించెను.

ఇదేవిధంగా వారు తమ నాట్య ప్రదర్శనములను పామహార్, చౌహాణ్ రాజాస్థానములలో గూడా చేసిరి.

ఈ రాజులనుండి గూడా వారు రాజపుత్రులనే బహు మానములుగా బడసిరి. ఈ విధంగా రాధా మోలాలు ముగ్గురు కొడుకులను స్వీకరించిరి.

నీలకంఠం అనే ఒక బ్రాహ్మణుడు ఉండెను. బీద తనం వల్ల ఆయనతన ముగ్గురు కూతుండ్లకూ ఆకాలంలో వుండే సంఘ మర్యాదననుసరించి యౌవనం రాకమునుపే పెండ్లిచేయజాలకపోయెను. గనుక నీలకంఠం తన ముగ్గురు కూతుండ్లను అడవికి తీసుకొనిపోయి ఒంటరిగా విడిచెను. ఈ సౌందర్యవతులైన పిల్లలను చూచి రాధ చాలా సంతోషించి వారిని తన పెంపుడు కొడుకులకు ఇచ్చి పెండ్లిచేసెను. వారి సంతతివారికి అతర్వాత రాథోడ్‌లు లేక భోడిక్యాలు పాంహార్లు, చౌహాన్లు అని పేర్లు వచ్చి నవి. బంజారాజాతిలో ఈ మూడు తెగలు ముఖ్యములై నవి.

ఈ మూడు ముఖ్యవర్గాలేకాక బంజారాలలో నాడ్‌త్యా అనే మరియొక తెగకూడా వున్నది.

కొందరు బంజారాలు ఒకప్పుడు దోమ గురునుండి ౧౨ కంచరగాడిదెల మోతగల ఒకానొక సరుకును అప్పుగా తీసుకున్నారు. వారు అప్పును తీర్చజాలనప్పుడు ఆయన తన శిష్యుడగు జాగూ అనే బ్రాహ్మణయువకున్ని ఆ అప్పును వసూలు చేయడానికి పంపెను. ఆ బ్రాహ్మ ణుడు పాంహార్ తెగకు చెందిన హాన్‌సీ అనే

పేరుగల ఒక అందమైన పిల్లను ప్రేమించి దానితో పాటు అక్కడనే నివసిస్తూవుండెను. హాన్సీ గర్భవతి కాగానే ఆరహస్యాన్ని కప్పిపుచ్చేనిమిత్తమై వారిద్దరూకలిసి అక్కడినుండి పారిపోయిరి. ఆమె ఒక అడవిలో ఒక శిశువును కనెను. ఈ అశాస్త్రీయమైన శిశువును ఒక మర్రి చెట్టు క్రిందపూడ్చి పెట్టుటకు వారిద్దరు ఇష్టపడిరి. ఆ చెట్టును వారి భాషలో 'వడేర్ఝాడ్' అని అంటారు. ఎప్పుడైతే వారు ఈ శిశువును సమాధిచేయుటకు మొదలు పెట్టిరో అప్పుడే ఆ గుంతలోనుండి వేలకొలది నల్లచీమలు బయటికి వచ్చినవి. ఒక కాకికూయుటకు మొదలు పెట్టెను. ఇది ఒక అపశకునముగా భావించి వారు ఆ శిశువును సమాధి చేయకపోయిరి. ఆ శిశువు ఒక వడేర్ఝాడ్ క్రింద సమాధి చేయుటకు తీసుకొని పోబడినందున ఆ సంతతివారికి "వాడ్త్యా" అని పేరు వచ్చినది.

మాథూరాలు అనబడే ప్రత్యేకమైన తెగ మరియొకటికలదు. ౧౯౭౧ సంవత్సరపు జనాభాలెక్కల ప్రకారం వారు ౩౯,౭౮౯ మంది ఉన్నారని తేలినది. మాథూరా తెగ స్త్రీలు బంజారా స్త్రీల రంగులోనే వుంటారు. గాని వారు కొప్పును ముడుచుకొనే విధముమాత్రం విచిత్రంగానూ, ఒక ప్రత్యేక ఆకారంలోనూ వుంటుంది. మాథూరాలు ఇతర ప్రజలతో ఎక్కువ సంబంధము లేకుండానే జనబాహుళ్యముగల జాతులలో నివసిస్తూ

వుంటారు. వారు ఇతర యేజాతివారిచేతినుండిగూడా ఆహారమును తినరు. పొయ్యిలోనిప్పులేకుండా వారు ఎప్పుడుగూడా భుజించరు. గోపాలకుడైన శ్రీకృష్ణుని సంతతి వారమని చెప్పకొంటారు. ఇతర లంబాడాలకన్నా వారు తమ ఆచారములలో పరిశుభ్రంగానూ, యోగ్యంగానూ ఉంటారు. వారు జందెమునుకూడా ధరిస్తారు. వారికి మాంసముతినే అలవాటు లేదు.

నేడుగూడా వ్యవసాయము వారి వృత్తులలో నొకటిగానున్నది. చాలా మంది మాధూరాలు తమ పశువులకు మేత దొరికే అడవిప్రాంతాలలోనే సంవత్సరంలో చాలా భాగం గడుపుతారు. అక్కడ వారు వెదురు చాపలతో గానీ లేక కొమ్మలతో గానీ లేక ఇండ్ల కప్పు కొరకు ఉపయోగించే గడ్డితో గాని తాత్కాలికనివాసములను నిర్మించుకుంటారు.

బంజారాలకూ, హిందువులకు మధ్యవుండే సామ్యమును తెలిపే ఒక విభజన పట్టిక చదువరియైన ఒక బంజారాచేత యివ్వబడినది. ఆ పట్టిక ప్రకారం మాధూరాలు బ్రాహ్మణులవంటి వారనీ బంజారాలు, క్షత్రియులవంటివారనీ, లంబాడాలు వైశ్యులవంటివారని తెలుస్తున్నది. ముఖ్యమైన యీమూడు వర్గాలేకాక కొండ జాతికి సంబంధించిన ఉపశాఖలు యింకా అనేకములు

కలవు. బంజారాలకు వంశపారంపర్యంగా వుండే బట్రా జులు (స్తోత్రపాఠకులు) ధారీలు, సంగారీలు, దలియాలు అనే పేర్లతో వున్నారు. వారు వివిధ వాద్యములను వాయి స్తారు.

బంజారాలకు మంగలిపని చేసేవారు నాఫీ అనీ, వారి పశుపాలకులు జోగీ అని పిలువబడుతారు.

బంజారా ఆడ పిల్లలకు ౧౨ సంవత్సరాల వయ స్సులోపుగా సాధారణంగా పెండ్లిచేయరు. పురుషుడు తన తెగను విడిచి యితర తెగలోని పిల్లను పెండ్లిచేసుకో గూడదని ఆ జాతిలో కట్టుబాటుకలదు. ఇంతేకాక తన తెగలో గూడా మాతృవర్గానికిగానీ పితృవర్గానికి గాని సంబంధించిన పిల్లను పెండ్లి చేసుకోగూడదని కూడ నిషేధంకలదు.

ఈ జాతిలో సాధారణంగా శవములను దహనం చేస్తారు. కాని అప్పుడప్పుడు సమాధిచేయడం కూడా ఆచారం కలదు. సమాధిచేసేఅప్పుడు ముఖము క్రిందుగా ఉండే రీతి పండుకోబెట్టి తలను దక్షిణదిక్కుగా వుంచె దరు.

బంజారాలు, తమ కన్నా పై జాతి హిందువులు తమ జాతిలో ప్రవేశించుటకు తక్షణమే అంగీకరిస్తారు. బంజారాజాతిలో ఆదిమవాసులైన గోండులు, కోర్కులు గూడా చేర్చుకోబడినట్లు కొన్ని దృష్టాంతములు కలవు.

రాజపుత్ స్థానం నుండి మధ్యభారత్, మధ్యప్రదేశ్, హైదరాబాదు, మైసూరు ప్రాంతాలగుండా మద్రాసుకు ప్రయాణం చేసే అప్పుడు మనకు కనబడే జాతులవారి పోలికలే దక్కన్‌లో వున్న బంజారాజాతి స్త్రీ పురుషులలో కనబడును. దీనివల్ల కొండ జాతులవారు ఉత్తర హిందూస్థానం నుండి దక్కన్‌లోకి వలసవచ్చినారనే సిద్ధాంతము ధ్రువము కాగలదు.

వరంగల్ జిల్లాలో అత్యధిక సంఖ్యలో-దాదాపు ఒక లక్ష వరకు-లంబాడా ప్రజలు కలరు. వరంగల్ జిల్లాలోని మహబూబాబాద్ తాలూకాలో ఈ జాతివారు విశేషంగావున్నారు. తురూర్ గ్రామం చుట్టూ మొత్తం లంబాడా తాండాలు వ్యాపించివున్నవి.

తురూర్‌లోని లంబాడాలు తమ జాతి సముద్ధరణ కొరకు చాలా ఆదుర్దాపడుతుండినారు. ఈ విషయం వారు తమ కొరకు సొంతంగా ఒక ప్రయివేటు బడిని స్థాపించుకొని, ఆ కేంద్రంలో విద్య నేర్పబడుచుండడం వల్ల రుజువైంది. వారి పట్టుదలకూ, ఆదుర్దాకు అన్ని విధములైన ప్రోత్సాహములు ఇవ్వదగియున్నవి. ఈ స్థలం అన్నిటికీ మధ్యన ఉండడం వల్ల ౧౯౪౭ సంవత్సరంలో ఇక్కడ బంజారా సంక్షేమ కేంద్రం యేర్పాటుచేయనైనది. వెంటనే ఇక్కడ ఉపాధ్యాయ శిక్షణా కేంద్రము, ఒక పాఠశాల స్థాపించబడినవి.

బంజారా భాషకు లిపి లేదు కాని ఈ ప్రజలకు చదువు నేర్పుటకు సౌకర్యం కలిగించే నిమిత్తమై వారి భాషను లిఖిత భాషగా మార్చి ఈ క్రింద చూపబడిన పుస్తకములు విద్యావంతులైన స్థానిక బంజారాల సహాయంతో దేవనాగరీ లిపిలోనూ, తెలుగు లిపిలోను వ్రాయబడినవి.

(౧) బంజారా బాలశిక్ష, (౨) బంజారా మొదటి వాచకము, (౩) బంజారా రెండవ వాచకము, (౪) బంజారా వయోజన శిక్షణ పటములు, (౫) బంజారా చిత్రపటములు, (౬) రాధా మరియు మోలా.

తుమ్మూరులో ఉపాధ్యాయ శిక్షణ కేంద్రము, ఒక ప్రాథమిక పాఠశాలయే కాక వివిధ తాండాలలో ౧౧ గ్రామ పాఠశాలలు కూడా అదనంగా స్థాపింపబడినవి. ఉపాధ్యాయ శిక్షణం పొందే అభ్యర్థులకు చదువునేర్పుటయే కాక చదువు చెప్పడంలో అనుభవశిక్షణంగూడా యివ్వబడుతున్నది. చదువుకొనుటకు కావలసిన సామగ్రి ఉచితంగా సరఫరా చేయబడుతున్నది. ప్రథమ, మధ్యమ, ఉత్తమ పరీక్షలలో కూర్చున్న ౭ మంది విద్యార్థులలో ౫ మంది ఉత్తీర్ణులైనారు. తక్కిన వారు ఈ సంవత్సరం పరీక్షలలో కూర్చొనగలరు.

మహబూబాబాద్ దగ్గర ఒక ఉపకేంద్రం కూడా తెరువబడింది. అక్కడ ఒక పాఠశాల, ఒక సహకార గిడ్డంగి ఉన్నది.

౨౨,౨౦౦ రూపాయిల మూలధనంతో ఒక సహకార గిడ్డంగి తెరవబడింది. ఈ ఆరు నెలల కొద్ది కాలములోనే అనగా ౧౯౪౯ సెప్టెంబరు ఆఖరు వరకు ఈ సహకార గిడ్డంగిలో ౧,౨౦౦ రూపాయిల లాభం వచ్చింది. ఈ గిడ్డంగిలో మొత్తం రూ. ౨౧౯౪౩-౭-౪ ల వ్యాపారం జరిగింది.

వైద్యసహాయం కొరకు బడ్జెట్‌లో ౧,౦౦౦ రూపాయల గుంజాయిషీతో పాటు తగిన యేర్పాట్లుచేయనైనవి. ఒక ఆరోగ్యశాఖ ఇన్‌స్పెక్టర్ నిరంతరం తాండాలకు పోయి వైద్యసహాయం చేస్తూవుంటాడు

ఈ విధానాన్ని అమలులో పెట్టుటకు నియమింపబడిన ఒక సాంఘిక సేవాశాఖాధికారి గూడా యీ ప్రాంతంలోవున్న బంజారాల ఆర్థిక పరిస్థితిని పరిశీలించే పనిలో నిమగ్నుడైవున్నాడు. ఆ ప్రణాళికలో అనేక విషయాలు చేర్చబడియున్నవి. గాని ఆర్థిక యిబ్బందివల్ల వాటిని తలపెట్టడానికి సాధ్యంకాలేదు.

గుల్బర్గా జిల్లాలోని బంజారాల సముద్ధరణకై కొన్ని సహాయ కార్యకలాపాలు చేయవలసిందని ఆ జిల్లా వాసులైన బంజారాలు చాలా మంది చెప్పినారు. ప్రజలు ఇచ్చిన ధర్మనిధితో బంజారాలకొరకు ఒక ఆహారశాలను ఒక అనధికార సంఘం స్థాపించింది. హాస్టల్ భవన

నిర్మాణం కొరకు రూ. ౪,౦౦౦ లు ప్రభుత్వం మంజూరుచేసింది.

ప్రతిసంవత్సరం ౩౨,౪౦౫ రూపాయిలు బంజారా సంక్షేమ ప్రణాళిక క్రింద ఖర్చుపెట్టబడుతున్నది. నల్లగొండజిల్లాలో పునరావాస సముద్ధరణ కార్యకలాపాలు ప్రారంభించడానికి చేయబడిన సూచనలు యోచింపబడుచున్నవి.

౧౯౪౬-౪౭ సంవత్సరంలో రూ. ౧,౭౫౭ లతో బంజారాల సముద్ధరణ కార్యకలాపాలు ప్రారంభింపబడినవి. కాని ౧౯౪౭-౪౮ సంవత్సరంలో యీ పనికై రూ. ౨౫,౧౨౭ ల గుంజాయిషీ అధికం చేయబడినది. ఆ తరువాతి సంవత్సరంలో కూడా ఇదేవిధముగు గుంజాయిషీ ఉండింది. ౧౯౫౦ అక్టోబరు నుండి ౧౯౫౧ మార్చి వరకు ఉండిన అర్ధసంవత్సరపు బడ్జెటు రూ. ౧౬,౨౦౨ లతో ఉండింది. ప్రస్తుత సంవత్సరపు బడ్జెటు రూ. ౩౨, ౬౬౫ లతో ఉన్నది.

---

# భిల్లులు

భారత దేశంలో వుండే ఆదిమవాసులందరి కంటె భిల్లులు చాలా పురాతనమైనవారు. వారిని గూర్చి రామాయణము, మహాభారతము, పురాణములు, ఈ మొదలైన ప్రాచీన గ్రంథములలో అనేక చోట్ల చెప్పబడియున్నది. శబరి రామునకు పండ్లను ఇచ్చి వాటిని తినుటకు ఆయనను అంగీకరింపజేసినట్లు రామాయణంలో కథ గలదు. ఆ శబరి భిల్లాంగనయే కదా !

భిల్లులు యుద్ధవిద్యలో మంచి ధైర్య నైపుణ్యములు కలిగి వుండడమనేది అనాది కాలనుంచి ఆచారంగా వస్తున్నది. వారి దృఢత్వము లోకప్రసిద్ధము. భిల్ల స్త్రీలు, యుద్ధ కాలంలో ఎల్లప్పటికీ తమ పురుషులను అనుసరిస్తూ, కొన్ని వేళల యుద్ధములలో పాల్గొనుచూ, కొన్ని వేళల వెనుకనే వుండి పురుషులకొరకు ఆహారములనువండి వారికి సేవచేస్తూ వుండినారు.

కొండలమీద వీరి గుడిసెలు తేనెతెట్టెల వలె పూర్వం ఉంటూ వుండెను. నల్లని శరీర చర్మం కలిగి అతి మోటుగా వుండే శరీర ఆకారం కలిగి, ఎల్లపుడు తిరుగుతూ ఉండే స్వభావం కలిగి, అవ్యవస్థితమైన జీవనం వల్లవిశ్రాంతి లేక వుండి వేటాడుటలో మంచి నైపుణ్యం

కలవారుగా ఉండిరి. అడవిలో దొరికిన దుంపలు, పండ్లు, వేటలో చంపబడిన జంతువులు వీరికి ఆహారములు.

మొగలు చక్రవర్తుల పరిపాలన కాలంలో దక్కన్ లోని భిల్లులు సత్ప్రవర్తనగల జీవితమును గడిపినారు. వీరు ఆ కాలంలో గ్రామ రక్షకులు గాను, దక్కన్ నుండి ఖాందేష్కు, బీరార్ ప్రాంతాలకు వెళ్లే లోయ మార్గాల రక్షకులు గాను, నియమింపబడిరి. ఔరంగజేబు మరణానంతరం దేశంలో అరాజకం ప్రబలినది. అప్పుడు స్వాతంత్ర్య ప్రియులు, ధైర్యశాలురు అయిన భిల్లులు మహారాష్ట్ర వేషాలను ప్రతిఘటించి, దుర్గమమైన పర్వత ప్రాంతాలను తమ నివాస స్థానములనుగా చేసుకొన్నారు. అప్పుడు భిల్లులకు దోపిడీలు వృత్తిగా ఉండేను. వారు ఇష్టం వచ్చినప్పుడెల్ల గ్రామాల మీద పడి వాటిని పాడుచేస్తూ కల్లోలాను గలిగిస్తూ ఉండినారు.

మహారాష్ట్ర రాజ్యములు బలహీనములైనప్పుడు పర్వత ప్రాంతాలలో ఉన్న భిల్లులు చిన్నచిన్న స్వతంత్ర రాజులుగా అయిరి, చుట్టుప్రక్కల ఉన్న దేశములను దోపిడీదారులనుండి రక్షిస్తూ లోయమార్గాలను కాపాడుతూ, సమ ప్రదేశాలలో వారి జీవనమును గడుపుకుంటూ వచ్చిరి.

౧౮౪౧ సంవత్సరమున, ప్రభుత్వము వారికి ఇచ్చిన భూములలో వ్యవసాయదారులుగా, చిన్న చిన్న భిల్లుల వర్గాలు స్థిర నివాసాన్ని ఏర్పరచుకొన్నారు. ఇప్పుడు వారి

పైన నిరంతరం నిగ్రానీ ఉంచబడింది. కాని ఇన్ని చేసినప్పటికిన్నీ వారి పునరావాసం ౧౯ వ శతాబ్ది ఆఖరువరకు చురుకుగా సాగలేదు. అప్పటి నుండి ప్రభుత్వపు రికార్డులలో వీరి ప్రశంస తగ్గిపోయింది. కాబట్టి వారిని ఆ కాలం నుండి శాంతముగా మెలగుచు వ్యవసాయం చేసుకొనేవారినిగా పరిగణింప వచ్చును. దురదృష్టవశాత్తూగా ఒక శతాబ్దికి మించి జరిగిన యుద్ధములు, వాటి వల్ల కలిగిన బాధలు ఆదివాసులకు, సుశిక్షితులైన ప్రభుత్వ సైనికులకు కలిగిన ప్రతియొక సాయుధ సంఘర్షణవల్ల ఏర్పడిన దురంతములలో ఎదిరించడం, యీ మొదలైన వాటి ఫలితంగా భిల్లుల నాగరికతకు, సంస్కృతికి భగం వాటిల్లినది. ప్రస్తుతం సంస్థానంలో ఉన్న ౧౮, ౦౨౧ మంది భిల్లులు ఒకచే చోట కూడి ఉండకుండా, ఔరంగాబాదు జిల్లాలోని అనేక గ్రామాలలోను, బీడ్ జిల్లాలోని కొన్ని గ్రామాలలోను చెదరిపోయి ఉన్నారు. వారికి మద్యపానమంటేఇష్టం. అమితంగా వ్యయంచేసేవారు, సోమరులు, నిరాడంబరులు, నీతిపరులు, విశ్వసనీయులుగా ఉంటూ భిల్లులు జీవనం గడుపుతారు. భిల్లులకు నేటి వరకూ కూడా ఆటలలో వేటలలో చేపలు పట్టడంలో, కథలు చెప్పడంలో చాలా ఇష్టం. ఆరు తంతెలు గల ఫిడేలు మీద వాయిస్తూ ఆడుతూ, పాడుతూ వినోదిస్తూ ఉంటారు.

ఇతర కొండ జాతులవారివలె కాక, భిల్లులు, తమ ప్రాచీన చరిత్రను మరచిపోయినారు. వారి పాటలు, పురాణాలు, కథలు వారి నుండి తెలుసుకోవలెనని ప్రయత్నంచేసి నప్పటికిన్ని ప్రయోజనం లేక పోయింది.

భిల్లులలో అధిక సంఖ్యాకులు హిందువులు. అయినా వారిలో ముసల్మానులు గూడా కొందరున్నారు. ఇస్లాం మతమును అనుసరించు భిల్లులకు "కాటోని భిల్లులు" అని పేరు. హిందూ భిల్లులను "టాడ్వీ భిల్లులు" అని అంటారు. ఈ రెండు తెగలవారికి గూడా తమ మతమంటే యేమిటో తెలియదు. కాని వారిరువురిలో ఒకరికంటె ఒకరు జాతిలో పెద్దవారమని అనుకుంటారు. ఇతర జాతులతో ఈ యిరు తెగలవారు వివాహ సంబంధములు చేసుకొనరు. సాంఘికంగా కాటోని భిల్లులు తక్కువవారమని అనుకుంటారు. ఇదేవిధంగా టాడ్వీ భిల్లులు సాధారణ కాపు జాతి కంటే సాంఘికంగా తాము తక్కువనీ నిమ్న జాతుల వారికంటె యెక్కువని అనుకుంటారు. ఈ రెండు తెగల భిల్లులు కూడా బంధుత్వ సంబంధాలు కలిగి కార్యాదులలో ఒకరి యిండ్లకొకరు పోతూవుంటారు. ఇతర గ్రామాదులలో వున్న తమ సోదర జాతీయుల శుభాశుభ కార్యములకు హాజరగుట చాలా ముఖ్యమని భావిస్తారు. ఈ యిరుతెగలవారూ ఒకే విధమైన భాష మాట్లాడుదురు. కాటోనీ భిల్లులకు ఒక ప్రత్యేకత గానీ ప్రత్యేక భాషగాని యేమీ లేదు.

తేనె, అడవిపంటలు సేకరించడం, చేపలను పట్టడం, కుందేళ్ళనూ, పక్షులను వలపన్ని పట్టుకోవడం, వంటకట్టెలు కొట్టి అమ్ముకోవడం ఇవి వారి ముఖ్యవృత్తులు. ఆయా ఋతువులలో చేసే పనులలో నియుక్తులు కావడమేకాక దినబత్తెం పైన కూలీ పనులు గూడా వీరు చేస్తూఉంటారు. ఈ పనికి వారికి దొరికే కూలీ చాలా తక్కువ. మామిడితోటలనూ, పంటపైరులను రక్షించడానికి ఒక కుటుంబాన్ని ఏర్పాటు చేసినప్పుడు ఆ కుటుంబానికి నెలకు ౧౦ రూపాయల జీతం యివ్వబడును. భార్యాభర్తలిద్దరూ ఒకరు లేనప్పుడు ఒకరు ఈ కాపలా చేస్తూవుంటారు. వారికి ఎప్పుడూ సొంతభూములు లేవు. వీరిలో చాలా కొద్దిమంది పట్టేదారులుగా నున్నారు.

౧౫ సంవత్సరములకు పూర్వము భిల్లులకు భూములివ్వడానికి కృషి జరుపబడింది. ఖుల్దాబాద్ భిల్లులకు సిరాన్‌మల్ దగ్గర వుండే శివాయి జమాబందీ భూములు కేటాయించబడినాయి. అయితే దుక్కిటెద్దులు లేనందువలన చాలామంది భిల్లులు ఈ సౌకర్యమువలన లాభం పొందక అనేకులు భూములు లేని అస్థిరమైన కూలీ జీవనం గడుపుకునే పూర్వపు పద్ధతినే అవలంబించినారు. ఒకటి రెండు చోట్లలో పట్టేదారులుగా వున్న కొద్దిమంది భిల్లులుమాత్రం ధనవంతులుగా ప్రసిద్ధులై "భిల్లులు వ్యవసాయమునకు, స్థిరజీవనమునకు తగినవారు కారు" అనే అపవాదమును పోగొట్టినారు.

వారి నివాసస్థానాలు సాధారణంగా "భిల్వాడా లేక భిల్‌హట్ట్" అనే పేరుతో వ్యవహరించబడును. వారి గూడెములు సవర్ణహిందువులు నివసించే గ్రామాల బహిర్భాగములలో నుండును. వాటిలో చాలావరకు పతనావస్థలోవున్న గుడిసెలే వుండును. వర్షాకాలంలో ఏమాత్రం వాటికి రక్షణ వుండదు. కాని చాలామంది భిల్లులు యిటువంటి గుడిసెలలో సంవత్సరమంతా నివసించరు. భూములపైనా, మామిడితోటలపైనా కావలివారుగా వారు నియమింపబడిన స్థలాలలోనే గడ్డితోనూ, ఆకులతోనూ గుడిసెలు ఏర్పరచుకొని వాటిలో బసచేస్తారు.

టాడ్వీ భిల్లులు వారి సొంత భాషయైన భిల్లీ భాషతో పాటు మరాటీ భాష గూడా మాట్లాడుతారు. వీరు మాట్లాడే మరాటీకి మరాట్వాడా గ్రామీణ ప్రజలు మాట్లాడే మరాటీకి ఏమీ అంత భేదం కనుపడదు. కొన్నికొన్ని మాటలు మాత్రం భిల్లులు, మరాట్వాడా ప్రజలకన్నా కొద్ది భేదంతో మాట్లాడుతారు. భిల్లులలో చదువుకున్నవాడు ఒక్కడుకూడ కనబడడు. వీరు తమ పిల్లలకు బడిచదువు చెప్పించుకోలేనంత బీద స్థితిలో వున్నారు. తమ పిల్లల వల్ల ఈ కుటుంబాలకు ఏమీ సహాయం దొరకడం లేదు.

ఈ రెండు తెగల భిల్లులకు మతంలో ఏమీ భేదం కనపడడం లేదు. కాని వారు సొంతంగా పూజించే దేవత ఒకటి కలదు. ఆదేవతను వారు 'గాజఘాట్' అని పిలుస్తారు.

ఈ దేవత విగ్రహం ఒక వెండి ఏనుగపై తీర్చబడిన ఒక మనుష్యుని ఆకారంలో ఉంటుంది. ఈ విగ్రహం ఒక అర చేతి వెడల్పులో వుంటుంది. ఈ దేవత ఒక గుడిసెలో స్థాపించబడి దానికి భిల్లులు మాత్రమే పూజా నైవేద్యాలు చేస్తారు. ఇతరులకు అనుమతి లేదు. దేవతపై వారికి అధిక భక్తి విశ్వాసాలు వున్నవి. ఈ దేవత పైన ఒట్టు పెట్టి చెప్పమన్నప్పుడు ఏ భిల్లు కూడా అసత్యాం ఎప్పుడూ కూడా చెప్పడు.

ఆ దేవత పై అనాదరణచూపితే "గాజఘాట్" అనే ఒక రోగం వస్తుందని వారు నమ్ముతారు. ఈ రోగం రావటానికి కండ్లు వాయడం గుర్తు అని వారంటారు. ఏ మందుతో గూడా ఇది నయం కాదనీ ఆ దేవతకు పూజా నైవేద్యాలు జరపడంతోనే నయమవుతుందని వారి నమ్మకం.

వీరి మతాచారములూ, సాంఘిక ఆచారములు హిందువుల ఆచారములవంటివే కాని వారి వివాహాలలో ఒక ప్రత్యేకత వున్నది పెండ్లి కూతురింటికి పెండ్లి కొడుకు వివాహార్థము వెళ్ళేటప్పుడు పెండ్లి కూతురు వైపు వాళ్లు పెళ్లి కొడుకు మీద ఉల్లి గడ్డలు విసిరే ఆచారము వీరిలో కలదు. దీనికి వారు "కాందాహాన్యానా" అని అంటారు. ఈ విసరే ఉల్లిగడ్డలను. పెండ్లికొడుకు స్నేహితులు కంబళ్లతోనూ, డాళ్లతోనూ అతనిపై పడకుండా ఆపుతారు. ఇది పూర్వం

పెండ్లికొడుకుయొక్క ఓర్పును పరీక్షించడానికిగానే ఉండేది. పెండ్లి కొడుకును గాయపర్చడానికి ఈ విధంగా యెంతో ప్రయత్నం చేస్తారు. అది అప్పుడు ఆవిధంగావుండినా ప్రస్తుత కాలంలో ఇది ఒక ఆచారంగా మాత్రమే పరిగణించబడుచున్నది. పెండ్లి కొడుకు పెళ్లి కూతురు ఇల్లు చేరగానే ఈ ఉల్లిగడ్డలు విసరడం ఆపబడుతుంది.

భిల్లులకు పరస్పరం కలిగే పోట్లాటలలో తీర్పు చెప్పే నిమిత్తమై మనుష్యుల సంఘంతో కూడిన ఒక "పంచాయత్" సాధారణంగా ఏర్పాటు చేసుకోవడం కలదు. ఆ జాతి పెద్దలను "నాయిగులు" అని కాని లేక "కార్బారీలు" అని కాని అంటారు.

---

# కొండజాతుల మతములు

ఆదివాసులు, కొండజాతుల మతములు దక్కన్‌లోని యితర చారిత్రిక మతములు వేటితో గూడా చేర్చి విభజించుటకు వీలుకాదు. అనేక ఆదివాసుల కొన్ని మతాచారములు మిక్కిలి నాగరకతా పరిస్థితిలోనున్న హిందూ మత సంప్రదాయములతో కలిసి వున్నప్పటికిన్ని వారి నమ్మకాలూ, ఆచారములు పరంపరగా వస్తున్న హిందూ మత తత్వమునుండి అనేక ముఖ్యవిషయములలో భిన్నముగానున్నవి. హిందూమతమునకు సంబంధించిన గ్రామీణ ప్రజానీకపు నాగరకతకన్నా ఆదివాసుల నాగరకత అతి ప్రాచీనమైనది కాబట్టి వారి మతంలో హిందూమతం అభివృద్ధి దశకు రావడంకన్నా మునుపే ఉండిన ఆచారములు అనేకములు ఉన్నవి. ఇట్లావుండగా చాలామంది ఆదివాసులు అనేక హిందూమతాచారాలను ఇతర మతముల కొన్ని ఆచారాలతో పాటు అవలంబించియున్నారు.

దక్కన్‌లో చాలా పురాతనకాలంనుండి వున్న చెంచుజాతివారు "గారెలమైసమ్మ" అనే స్త్రీదేవత పైననూ, హిందువులు "భగవానుడు" అనే దేవునికి చాలా దగ్గరి సంబంధం కలిగివుండే "భగవంతరు" అనే పురుష దేవతపైనను విశేష విశ్వాసం కలిగివుంటారు. గారెల

మైసమ్మ అనే దేవతకు క్రూరమృగములను అదుపులోవుంచే శక్తి, వేటలో మంచి అదృష్టమును ప్రసాదించే శక్తి, ఈ రెండు కలవని వారి విశ్వాసము. ఆ దేవత, పువ్వులు పూయుటకూ, పండ్లు పండుటకు గూడా కారణమని వారంటారు. ఇంతే కాక ఆమె వేటకాండ్రకూ, ఆహారమును ప్రోగుచేసుకునేవారికిన్నీ ప్రాణాధారములైన పై రెండు ఆరణ్యక వస్తువులపైనా అధికారం చెలాయిస్తుందని వారినమ్మకము. చెంచులు వేటకు బయలుదేరుటకుపూర్వము ఆ దేవతను దర్శించి తమకు సహాయం చేయవలసిందని ప్రార్థిస్తారు. వేటలో వారు చంపిన ప్రతి మృగములోను ఒక కొద్దిభాగముఆమెకు నైవేద్యంగాయిస్తారు. ఇదే విధంగా వారు తినే పండ్లలో ముఖ్యమైన పండ్లు అడవిలో పండినప్పుడు వాటిలో మొదటపండిన పండును గారెల మైసమ్మకు నైవేద్యంచేసి ఆతర్వాత వారు తింటారు. "భగవంతరు" అనే దేవత స్పష్టంగా ఒక ఆకాశదేవత అని అనవచ్చును. ఆ దేవత వర్షపాతములను, ఉరుములను అదుపులో వుంచును. మనుష్యుడు ఈ భూలోకంలో చేసిన పాపాలవల్ల అతని ఆత్మ ఘోర పిశాచరూపంలో మారితేతప్ప, ప్రతి వ్యక్తియూ భగవంతరునుండియే పుట్టి, మరణించినతర్వాత అతని జీవాత్మ ఆ దేవతలోనే లీనమైపోతుందని చెంచువారి విశ్వాసము. మొదట పండినపండును భగవంతరుకు నైవేద్యం పెట్టనిగాని అనేక సంద

ర్భములలో ఆ దేవుణ్ని ప్రార్థిస్తారు. ముఖ్యమైన యీ రెండు దేవతలనేగాక చెంచులు అనేక చిన్నచిన్న దేవుళ్ళను కూడా కొలుస్తారు. ఆ దేవుళ్ళలో కొన్ని యిరుగు పొరుగు గ్రామాల తెలుగు ప్రజలు కొలిచే దేవుళ్ళను పోలి యుండును. చెంచుజాతిలో మతాచార కర్మలు చాలా విపులంగా లేవు. మతనియమ ప్రకారం చెంచువారు స్వేచ్ఛగానూ, లాంఛనప్రాయంగాను దేవతలను కొలుస్తారు. మతగురువులు ఉండరు. అవసరమైనప్పుడు ప్రతి చెంచువాడు స్వయంగా పోయి దేవతను ఆరాధిస్తాడు. మతకర్మలు చేయడంలో స్త్రీలు పాల్గొనరు. చెంచుజాతిలో పూజాదులలో పశువధ, పితృదేవతలకు శ్రాద్ధాదులు చేయడము లేదనేవిషయం ముఖ్యంగా గమనించదగిన విషయము.

పురాతనకాలంనుండి సంచార సేద్యం చేసుకుంటూ వుండే కొండజాతివారిలో చేరిన కొండరెడ్ల మతము చెంచులమతంకన్నా చాలా భిన్నంగావుంటుంది. ఈ రెడ్లకు దేవునిపై విశ్వాసంలేదు. వారు మనుష్యరూపంలోవున్న చిన్నచిన్న కొండదేవతల నెందరినో కొలుస్తారు. ఆ దేవతలు మనుష్య ఆకారంలోనే అడవుల్లోనూ, పర్వత శిఖరములయందును ఉంటారని అనుకుంటారు. ఆ దేవతలందరూ శక్తివంతులుకారు. కాని వారు మనుష్యులకు సహాయం చేయడానికిగానీ లేక బాధపెట్టుటకుగాని సమర్థులు.

వారు, పక్షులూ, పందులూ, దేవతల బలులతో ప్రసన్నులగుదురు. కొండ దేవతకిచ్చే బలులేకాక భూదేవతకు కూడా ముఖ్య వ్యవసాయపు పనుల కాలంలో రక్తబలుల నిచ్చి కొలుస్తారు. ఆ దేవత ముఖ్యంగా దయగలదేకాక మనుష్యులకు అపాయకరమైన రోగాలు కలిగించే ముత్తేలమ్మ, పోచమ్మల వంటి స్థానిక దేవతలకన్నా వేరుగా వుంటుంది. కొండ రెడ్లలోనూ, వారి యిరుగు పొరుగులలో వుండే కోయలలోను, మనుష్యబలులిచ్చే ఆచారం కలదు. ఆ ఆచారం ఇప్పట్లో ఒకవేళ వాడుకలో లేకున్నప్పటికిన్నీ తిరిగి వాడుకలోకి రావచ్చుననే వదంతి మాత్రం ప్రజలలో అలజడినీ, అశాంతిని కలిగించగలిగేదిగావున్నది. చెంచులవలె గాక, రెడ్లు, పెద్దపెద్ద విందులూ, ఉత్సవాలు చేసుకుంటారు. అవి సాధారణంగా తెలంగాణా గ్రామీణ నాగరకతను అనుసరించి చేసే మతకర్మలను పోలివుండును. గ్రామ ప్రజలకు వారి వంశపరంపరగా వస్తూవుండే మతగురువులు ప్రతినిధులుగా వుందురుగాబట్టి బలి కర్మలలో వారే ప్రధాన పాత్రను వహిస్తారు. పంటలు కోతకు వచ్చినప్పుడు మొదటి ఫలాన్ని మరణించిన పితృదేవతలకు నివేదిస్తారు. ఇంతకుతప్ప వేరే పితృకర్మలు ఏవీ వారు చేయరు.

గోండుల మతమూ, కోయల మతము కొండరెడ్ల మతాచారాలు కొన్నింటితో కలిసియుండును. వారు భూ

మాతను పూజిస్తారు. వ్యవసాయపు పనులలోనూ, ప్రతి సంవత్సరమూ తప్పకుండా తెగుళ్ళను గలిగించే దుష్టదేవతల రాకడను ఆపే ఉద్దేశంతో చేయబడే బలికర్మల లోనూ ఆ ఘూమాతను కొలుస్తారు. అయితే గోండులు ముఖ్యంగా తమ ఇలువేల్పును పూజిస్తారు. ఇది వారి మతాచారములలో ప్రధానమైనది. ఈ ఇలువేల్పు పూజను తప్పకుండా చేయవలెనని వారి పురాణములలో చెప్ప బడింది. ఇదే ఆచారము కోయలలో గూడా వున్నది. ప్రతి గోండు జాతీయుడూ పెర్సాపెన్ (పెద్దదేవుడు) అనబడే తమ కులదైవమును కొలుస్తూ వుంటాడు. కొన్ని సందర్భాలలో ఈ పెర్సాపెన్ అనేదేవత స్పష్టంగా దేవతా రూపమును దాల్చిన ఆ జాతి పూర్వీకుడే అని భావించబడును. ఈ పెర్సాపెన్ అనే దేవత కొలువు రూపంగా సంవత్సరానికి రెండు పర్యాయములు ఆ జాతివారు అనేకులు కలిసి ఒక ఉత్సవమును జరుపుతారు. అనేక దినముల పాటు జరిపే యీ ఉత్సవాలలో పక్షులూ, మేకలూ, ఆవుల బలులు ఇస్తారు. తొలిపంట తినుట, వివాహములు ఈ మొదలైన ముఖ్య మతకర్మల సందర్భాలన్నింటిలో గూడా పెర్సాపెన్ అనే దేవతను ప్రార్థిస్తారు. మరణించిన వారి ఆత్మలు పెర్సావెన్‌లోనూ, పితృదేవతలలోనూ విధిగా చేరగలవు అని వారి విశ్వాసము. ప్రతి వంశానికిన్ని ఒక కులగురువు, పెర్సాపెన్ దేవతను ఆరాధించే

పనికొరకు ఉంటాడు. ఆయనతోపాటు ప్రధాన్ అనే ఒక బ్రాటాజుకూడా పూజాకర్త్రలను నిర్వహిస్తూవుంటాడు ఆ బ్రాటాజు ముఖ్యంగా చేయవలసిన పని యేమంటే ఆ వంశచరిత్రను తరుచుగా పఠిస్తూ దానిని మరచిపోకుండా వుంచడమే.

వారు చేసే శివపూజ కులదేవత పూజకన్నా పూర్తిభిన్నంగా వుంటుంది. గోండుజాతిలో అనాదిగా పెర్సా పెన్ దేవత పూజకు ఉన్నంత ప్రాముఖ్యం యీ శివపూజకు లేదు. శివపూజలో కొబ్బరికాయలు కొట్టి మధురాహారములు మాత్రమే నైవేద్యం చేయబడును. కాని జంతు బలి యివ్వడంలేదు. ఇది కేవలం శివునిపూజించే 'పోలా' అనే హిందూ ఉత్సవముల వంటిదే.

మరణించినవారిని ఉపచరించే విషయంలో చాలా శ్రద్ధవహించబడును. చితిదగ్గర గోబలి ఇవ్వడం మరియు చితిచుట్టూ రాత్రి నాట్యములు చేయడంతో వారు చాలా గొప్పగా దహనసంస్కారములు చేయడంమాత్రమే కాక మరణించినవారి గౌరవార్థం వారి స్మారక చిహ్నంగా అధికవ్యయంతో విందులు కూడా చేసుకుంటారు. ఆ విందుల సందర్భంలో కూడా గోబలి యివ్వడం చాలా అవసరమైనది. ఇండ్లలో జరిగే పితృకర్మలలో చాలావరకు మరణించినవారికి చిన్నచిన్న ఆహారములు నైవేద్యములుగా యివ్వబడును. మరణించినవారి ఆత్మ అతడు మరణించిన

తర్వాత పుట్టబోయే అతని మనుమనిలో తిరిగి అవతరిస్తుందనే విశ్వాసము ఈ జాతివారిలో ఉన్నది.

కులగురువులే కాక గ్రామ పురోహితులుగూడా వున్నారు. వారు ఒక గ్రామంలో స్థానికంగా వుండే దేవతలకు పూజలుచేసేవారుగా వుంటారు. అయితే పురోహితత్వమనేది ఒక వృత్తిగాదు. దానివల్ల మనుష్యులు చేసే వ్యవసాయం మొదలైన సాధారణవృత్తులకు భంగం కలుగదు. దేవతాపూజకులకు "భక్తాల్" అని పేరు. వారు దేవతలతో నేరుగా సంబంధం కలిగించుకోవడంలోనూ, వారికి శివమెక్కినప్పుడు దేవతల తలంపులను ఇతరులకు తెలుపుటలోను సమర్థులుగా వుంటారు.

గోండుమత మొక మిశ్రమమైన పద్ధతిగలది. అందులో మానవజీవితానికి సంబంధించిన ప్రతివిషయమూ కలదు. పూర్వాచారములకూ, సత్ప్రవర్తనకు ఆ మతం యెక్కువ ప్రాధ్బలం యిస్తుంది. పూజాబలులచేత సంతృప్తిపరచవలసిన దేవతలకు అసంతుష్టి కలిగించడంవల్లనే గోండజాతి నుండి బహిష్కృతమైన శాఖ ఒకటి యేర్పడెను. ప్రాచీన గాథలను పరిశీలిస్తే పూర్వ వృత్తాంతము తెలియగలదు. ప్రస్తుత పద్ధతుల ఆచరణకు గూడా అవి అనుమతి యిస్తున్నవి. జీవించినవారూ, మరణించినవారి మధ్యా జరుగుచున్న, జరిగిన విషయాలమధ్యా ఏదో ఒక అవినాభావ సంబంధము ఉన్నదని గోండులవిశ్వాసము.

కోయలు రెండేండ్లకొకసారి వరంగల్ జిల్లా ములుగు తాలూకాలోని మోరారంగ్రామంలో ఒక జాతర చేస్తారు. ఆ జాతరలో వారు సార్లమ్మ (తల్లి) మరియు 'సాదేలమ్మ' (కూతురు) అనే ఆయిద్దరు దేవతలను కొలుస్తారు. ఆ జాతి వారందరి విశ్వాసంప్రకారం ఆ దేవతలు ఒక పర్వత సమీపంలో స్పష్టంగాకనుపించే ఏలాటి విగ్రహంగాగాని మూర్తిగాగాని లేకుండా వుంటారట.

రెండు సంవత్సరముల కొకసారి ఆ జాతరను సేవించుటకై కరీంనగరం జిల్లానుండి గూడా వచ్చే యాత్రికులతోపాటు వేలకొలది సంఖ్యలో యాత్రికులు దూరం నుండి వస్తారు. అక్కడ పూజాకర్మలు జరిగే చోటు గూడా ఏమంత ఆకర్షణీయంగా లేదు. అక్కడ ఒక మూర్తి లేదు. అయితే తాత్కాలికంగా అమర్చబడిన మూడు కొయ్య ద్వారాలలో వివిధప్రమాణముల గంటలు కట్టబడియుండును. చెట్లకింది భాగంలో మోటుగా చిత్రించబడిన కొయ్య స్తంభములు కొన్ని ఉండును. వీటిలో ఏదీ యొక్కటిగూడా పైన చెప్పబడిన పర్వతాగ్రతస్థిత దేవతకు ప్రతిసిధిగా ఉండదు. మత కర్మలకు సంబంధించిన కొన్ని వస్తువులు గ్రామంలో ఒక కుండపైన ఉంచబడును గాని వాటిలో ఒక్కటిగూడా దేవతా చిహ్నంగా పరిగణింపబడదు. ప్రార్థనలూ, మొక్కుబళ్ళు చెల్లించుటకొరకై ఆ జాతరకు వచ్చు చాలామంది భక్తులచేత

మొక్కుబళ్ళ రూపంలో సమర్పింపబడే అధికధనం రావడ మనేది ఆ జాతరలో ఒక ప్రత్యేకమైన విశేషము. ఆదిలాబాద్ నగరానికి ౨౦ మైళ్ళ దూరంలోవున్న ఆదిలాబాద్ తాలూకాలోని కేసలాపురం అనే ఒక గోండుల గ్రామంలో అక్కడి గోండు జాతివారు జరిపే జాతర, కోండ జాతుల వారూ, తదితరులు జరిపే అన్ని జాతరలలోకెల్లా చాలా ముఖ్యమూ, దర్శనీయంగాను ఉండును. పచ్చని పర్వతములు, అడవులు చుట్టుపట్ల నుండగా కేసలాపురం గ్రామంలో ప్రతి సంవత్సరమూ చాలా వేడుకగానూ, దర్శనీయంగాను జాతర సాగుతుంది. అది పుష్యశుద్ధ విదియనాడు సాగును. అప్పుడు వేలకొలది గోండులు ఒకచోట చేరి ఆనందిస్తారు. దూరగ్రామాలనుండి వచ్చిన గోండులు అక్కడి "నాగశేష" అనే దేవతకు భక్త్యంజలులు సమర్పిస్తారు. నెమలి యీకెల గుత్తితో అలంకరించబడి చిత్తగువులు చెక్కిన ఒక కొయ్య బద్ద "కొలాము" లందరికీన్ని ముఖ్య దేవత. ఆ బద్దకు "అయాక్" అని పేరు. వారు కొలామీ భాషగాక యితర భాషలో మాట్లాడేటప్పుడు ఆ దేవతను "భీమన" అని గానీ లేక "భీమదేవ" అనిగానీ అంటారు. ఇది గోండుల భీమనపెన్కు చిహ్నంగా ఉండేదని గోండులూ, కొలాములు, అంగీకరిస్తారు. పూర్వకాలంలో, ప్రతియొక్క ప్రదేశానికి సంబంధించిన గోండు వర్గాలవారున్ను అయాక్ అనే దేవతకొరకు వారి సొంత పుణ్యక్షేత్రమునూ, సొంత విగ్రహమును ప్రత్యేకంగా కలిగియుండిరి. ఆ పుణ్యక్షేత్రములో

వారి మరణించిన పూర్వుల సమాధులు నిర్మింపబడుచుం డెను. అక్కడ ఉత్సవ దినాలలో అందరు చేరుతుండిరి. అనేక కొలాము గ్రామాల బహిర్భాగంలో అయాక్ చిహ్నం గల చిన్న చిన్న విగ్రహాలు ఒకటి గానీ లేక ఒకటికన్నా యెక్కువ గానీ వుంటవి. అవి, గోండువర్గాలలో సిరంగా వుండే పురాతన విగ్రహాలతో పాటు అదనంగా వుంటవి. కొలాములు, అయాక్ నే గాక గ్రామదేవతయైన పోల కమ్మను గూడా కొలుస్తారు. రోగాలు సంభవించినప్పుడు వారు బలియిస్తామనే మొక్కుబళ్లతో ఆ దేవతకడకు వెళ్లు తుంటారు. అంతే గాక "గాబురాకీ" అనే మరియొక దేవత గూడా వున్నది. ఆ దేవత అపాయములూ, యీతిబాధలు రాకుండా గ్రామమును కాపాడును. పొలంలో విత్తు నాటే టప్పుడు కొలాములు భూదేవతకు పందినిగానీ, కోడినిగానీ బలియిస్తారు. అయితే అక్కడ ఒక విగ్రహంగానీ ఒక స్తంభంగానీ స్థాపించబడదు.

నాయక్ పోడుల మతము అనేక అంశాలలో కొలాముల మతమును పోలియుండును. నెమలి యీకెలతో అలంకరించబడి చిత్రకువులు చెక్కిన కొయ్యబద్ద రూపంలోఉన్న "భీమలియాక్" లేక "భీమన" అనేది వారి ముఖ్య దేవత. ఈ భీమనయే కాక యితరములైన వివిధ దేవతలు యిలువేల్పులు గా కొలువబడుతున్నారు. జనన, మరణ, వివాహోత్సవాలలో జరిపే మతకర్మలు విశేషంగా తక్కువ జాతి హిందువుల కర్మలను అనుసరించియే యుండును.

బంజారాల ముఖ్య దైవములలో "శీతలాభవాని" ఒకటి. ఈ దేవత సాధారణంగా వారి తాండా బహిర్భాగంలో ఒక మైదానంలోనున్న భూమిలో ఒక క్రమంలో లేకుండా వుండే వలయంలో పాతబడిన పెద్ద పెద్ద మేడురాళ్ళ రూపంలో వుంటుంది అన్నిటికంటే పెద్దదైన నడిమిరాయికి సిందూరం పూయబడును. దసరాకు పూర్వం పూజాదులకొరకు ఆ చుట్టుపట్ల భూమియంతయు శుభ్రపరచబడును. ప్రతియొక్క కుటుంబమూ బలికొరకు ఒక కోడిని సమర్పించును. ప్రతియొక్క కుటుంబంవారున్ను పెద్దరాతిదగ్గర ఒక్కొక్క పళ్లెంనిండా శనగగుగ్గిళ్ళను ఉంచుతారు. ఆ మైదానంలో ఆ రాళ్ళచుట్టూ అన్ని పశువులను మందగా చేర్చి ఉంచుతారు. ఆ క్రిందటిరాత్రి ఉపవాసంచేసిన ఒక బంజారావాడు అక్కడ ఆనాడు పూజారిగా వుండి భక్తులు తెచ్చిన బలి మొదలైన నివేదనలను అందుకునే నిమిత్తమై ఆ రాళ్లకుప్పయొద్ద కూర్చుంటాడు. ప్రతి కుటుంబానికి ఒక్కొక్కడుగా ముందుకువచ్చి అతడు తెచ్చిన కోడిని కత్తితో తలనరికి పూజారియెదుట వుండే జెముడు చిగురులో ఆ తలను వేస్తూ మొండెమును ఆ చుట్టూవున్న పశువులవైపు విసరివేయును. ఆ పశువుల కొమ్ములకు కోడిరక్తము పూయబడును. పూజారి ఆ శనగగుగ్గిళ్ళలో తనభాగాన్ని తీసివుంచుకొని మిగిలినవాటిని అక్కడ చేరియున్న బంజారాలకు పంచిపెట్టును. ఆచోటనే వేడుకలూ, నాట్యాలు జరుపబడును.

"శివభయ్యా" అనేది వారి మరియొక యిష్టదేవత. ఆ దేవతపేర వారు ప్రమాణములు చేసెదరు. ఆ దేవతపేర ప్రమాణముచేసి యెవడుకూడా అసత్యము చెప్పడానికి సాహసించడు. ఒకవేళ అసత్యము చెప్పినయెడల అతని కొడుకు గాయపడుటయో, అతని పశువులు అంటురోగముల చేత బాధపడుటయో తప్పకుండా జరుగుతుందని వారి విశ్వాసము. బంజారాలు వారి బరువులు మోయు పశువులను పూజించెదరు. దీనికొరకై వాటిలో ఒక పశువుకు "హాతడియా" అనే పేరు పెట్టి వేరుగా ఉంచెదరు. ఈ పూజవల్లన తమకూ, తమ పశువులకు వచ్చే రోగములు నయమవుతాయని వారు నమ్ముతారు.

మంత్ర తంత్రములంటే చెంచువారిలో అంత విశేషమైన నమ్మకము లేదుగాని వాటి బలమందలి విశేష విశ్వాసముగల రెడ్డిజాతిలో అవి చాలా ప్రాముఖ్యము వహించియున్నవి. ఆ జాతివారు మాంత్రికులు చేసే కుట్రలవల్ల జబ్బులుగానీ లేక చావులుగాని కలుగుతాయని ఆ కుట్రలకు సులభంగా లొంగిపోతారు. గోండులు దుష్టములగు మంత్రములందు దృఢవిశ్వాసము గలవారై వుంటారు. గారడీవారూ, మంత్రకాండ్లు చేసే క్రియలవల్ల చాలా బాధలు కలుగుతాయని గోండులు భావిస్తారు. మతమునకూ, మంత్రతంత్రములకు చాలా తక్కువసంబంధం కలదు. మాంత్రిక

విద్య అనేది దేవతలకూ, పితృదేవతలకు జరిపే ప్రత్యేక పూజా పద్ధతుల ననుసరించి వుంటుందని భావింపబడింది. ఇంతేగాక అభిమాన పాత్రమైన యీ విద్యయందలి ఉద్దేశాలు అనేక మత కర్మలలో దూరుకొని యున్నవి. మొత్తం మీద బంజారాలు మాంత్రికుల తంత్రాలలో చిక్కుకొనరు గాని మంచివీ చెడ్డవీ అయిన మంత్ర తంత్రములు వారి అనుభవంలో నున్నవి. బుద్ధిశాలి లేక ఉపాయశాలి యైన మనుష్యుడు లేక మంత్రవైద్యుడు ఐన "జనతా" అనేవాడు దీర్ఘరోగములు, పశురోగములు, అకస్మాన్మరణములు లేక యితర బాధలు కలుగడానికి కారణములను విచారించి చికిత్సచేయును. తరుచుగా ఈపని చేసే ఒక స్త్రీ "డాకూన్" లేక మంత్ర వైద్యురాలు అని పిలువబడుతుంది. మంచి మంత్ర వైద్యులు "నింబూకాట్నా" (నిమ్మకాయలు కోసేవాడు) అని పిలువబడను. ఇది కేవలం దుష్టశక్తులను నివారించడానికీ, దుష్ట మాంత్రికుల దుస్తంత్రములను త్రిప్పడానికి మాత్రమే అలవాటులో పెట్టుకోబడుతుంది. ఇటువంటి మంచి మంత్రశక్తిని అలవాటులో పెట్టుకున్నవారు చాలా గౌరవింపబడుదురు.

ఆదివాసేతరులు ఆదివాసులతో విశేషంగా కలియడం మూలాన వారి నాగరకతలో హిందువుల మనోభావాలు,

ఆచారాలు క్రమంగా కలిసిపోతున్నవి. ఆటవికత్వమునుండి తొలగిపోయిన భిల్లులవంటి ఆదివాసులలో పురాతన పద్ధతులు చాలా కొద్దిగా మాత్రమే నిలిచియున్నవి.

---

# ఆదివాసుల పంచాయతీ సంఘములు

భారతదేశంలో గొప్ప విజ్ఞానము, నాగరకత వుండడమేకాక గొప్ప పర్వతములు, అరణ్యములు గూడా వున్నవి. ఈ దేశంలో కాలగతికీ, ప్రాచీన కాలమునుండి పరంపరగా వస్తూవున్న దేశీయుల సక్రమ నివాసమునకున్ను, మితిమీరిన మార్పులు కలిగినప్పటికిన్ని యేమాత్రం చలించకుండా అవి వున్నవి.

భారత దేశ చరిత్రలో ఆదివాసులసంఖ్య చాలా తక్కువ ఉన్నట్లు చూపించినప్పటికిన్ని దేశంలోవున్న వివిధ మానవజాతులను పరిశీలించి చూస్తే ఆదివాసులసంఖ్య ఏ విధంలోగూడా అంత తీసివేయ తగిందిగాదు. నాగరకతగల ప్రాంతాలకు సన్నిహితంగా నివసిస్తున్న చాలామంది ఆదివాసులకు ఇతర అభివృద్ధి జాతులతో సమైక్యత కల్పింపబడినప్పటికిన్ని సంస్థానంలో ఇంకా ౬,౭౮,౧౪౯ మంది కొండజాతులవారు ఉన్నారు.

దేశంలో రవాణా సౌకర్యములు చురుకుగా అభివృద్ధి చెందినమూలాన కొండజాతులవారి ప్రాచీన నాగరకత పడిపోయి నవీనంగా మారినప్పటికిన్ని ఆహారసేకరణ చేసేవారు, ప్రాచీన శిలాయుగపు వ్యవసాయదారులు అదేవిధ

మైన నిరాడంబర జీవితమును మూఢనమ్మకముతో గడుపు తున్నారు. హైదరాబాదు సంస్థానములో ఆదివాసుల సాంఘిక వ్యవస్థలో పంచాయతీ సంఘముల యేర్పాటు ఉండడమనేది వారి నాగరకతకు ఒక ముఖ్యమైన గీటురాయి.

కొండజాతుల జీవనంలో, వారి పల్లెలు పరిస్థితమైన వివిధ సాంఘిక యూనిట్లుగా శాశ్వతమైన పునర్వ్యవస్థ కల్పింపబడినవి ఇంతేగాక ఆ జాతికి సంబంధించిన అంతరంగిక పరిపాలన వ్యక్తిగతంగాగాక సమష్టిగాగూడా పునర్వ్యవస్థీకరింపబడినది. ఈ విధంగా ఆజాతి సాంఘిక సంస్కృతి సంబంధములు నిలబెట్టబడినవి. పంచాయతీ సంఘాలు గట్టి పరిపాలనా యంత్రములుగా నున్నవి.

గోండులగ్రామంలో వుండే పంచాయతీసంఘ సభ్యులతోనూ, అధ్యక్షునితోను గూడినసంఘము ఒక సక్రమ సంఘం కాదు. అది అయిదుగురుసభ్యుల ఆవశ్యక సంఖ్యతో గూడిన ఒక ప్రధాన గ్రామస్థుల వర్గమని చెప్పవచ్చును. ఒక వ్యవహారమును నిర్ణయించుటకు చాలామంది ఒకవేళ అక్కడ హాజరై ఉండవచ్చును. ఒక వ్యవహార నిర్ణయాధికారము, నైతిక ధర్మానికి అవసరమైన గౌరవమూ, స్వాధీనానుభవములో నున్నవీ లేక అనేక పుత్రులవీ యగు కొన్ని ఆస్తులపై అధికారం కలిగియుండుట, కొండజాతులవారి దేశభక్తి, ప్రభుభక్తికి సంబంధించిన రికార్డు ఈ మొదలైన విషయములు ఒక మనిషికి సభలో ప్రాముఖ్యం వహించుటకు

హక్కును కలిగించును. అయితే ఇది యిలాగే వుండవలె నని యేవిషయముగూడా నిర్ణీతముగా వుండదు. వ్యవహార కాండ నడుపుటకు యేవిధమైన శాసననియమాలు లేవు.

కాబట్టి కొండజాతులవారి బాగోగులను నిర్ణయించుటకు నిజముగా కొండజాతి ప్రజల అభిప్రాయమే వ్యవస్థ రూపాన్ని వహించియుండును. ఈ పద్ధతివలన గోండులనూ, అసవర్ణ హిందువులనూ చాలా కచ్చితమైన నిరంకుశాధికారంతో పరిపాలించే అధికారులు తరుచుగా పైకి వస్తూవున్నప్పటికిన్ని ఈ సంఘాలలో ఏకప్రాతినిధ్యం వహించేవాడు చాలా అరుదుగా కనబడును.

గోండులలో విడాకులిచ్చే ఆచారం కలదుగాని అది అనుభవంలో చాలా అరుదుగా వుంటుంది. అట్టి అభియోగాలు పంచాయతీ సంఘాలయెదుట పెట్టబడును. అప్పుడు ఒక గడ్డిపోచను నడిమికి తుంచి భూమిపై ఆ రెండు గడ్డి ముక్కలు వేర్వేరుగా పడవేసే పవిత్రకర్మ యథావిధిగా చేయబడును. ఒకమట్టికుండ ముక్కలు ముక్కలుగా పగులగొట్టి ఒక రూపాయిగూడా భూమిపైన పడవేయబడును. కాని తత్క్షణమే ఆ రూపాయిని పంచాయతీ సభ్యుడొకడు తీసుకొనును. అది సభ్యుల ఉపాహారం నిమిత్తమై ఉపయోగించబడును. ఆ తరువాత పంచాయతీ సభ్యులు సంఘాచార ప్రకారము భార్యాభర్తలు విడి

పోయినారు, ఒకరిపైన ఒకరికి యేవిధమైన హక్కులూ ఉండబోవని ప్రకటించెదరు.

మతంలోనుండి వెలివేయడమనేది పంచాయితీ సభ్యులు ఇచ్చే కఠినదండనలలో ఒకటి. గ్రామపెద్దలకు భయపడకుండా వారిని నిర్లక్ష్యము చేసే చాలమంది బాల బాలికలకు తండ్రి భాగమివ్వడము నిరాకరించడంద్వారా యింటిలో ఒకవిధమైన అశాంతిని కలిగించి ఆ జాతి బాలబాలికలు అణచివేయబడుదురు. (ఈ పద్ధతి ఉర్దూభాషలో "హుక్కా పానీ బంద్") అని అంటారు.

పూర్వకాలంలో ఆసురాబాద్, ఫరహాబాద్ నుండు వలపైన ఉన్న చెంచులు స్వతంత్రవర్గాలుగా ఉండిరి. వారు అధర్మంగా ప్రవర్తించినప్పుడు ఆ జాతివారు వారికి యిచ్చే శిక్ష యిది ఒకటే అయియుండెను. నేటికాలంలో ఖూనీలు మొదలైన కఠినేరములు ఏవైనా వారుచేసిన ప్పుడు ఆంతరంగిక విచారణ చేయకుండా బయటి అధికా రులు వారిని ఒకచిక్కులో యిరికించెదరు నేటికాలంలో గూడా ఒక నిర్ణీత శాసనమును అతిక్రమించినపుడు అట్టి నేరస్థునివల్ల సంభవించిన కల్లోలములమూలంగా ఆ జాతి వారికి కలిగిన కోపం పెరిగిపోతుంది. దాని ఫలితంగా వెంటనే ఆ నేరస్థునికి శరీరదండన ఇవ్వబడును. ఇంతే గాక భంగమైపోయిన స్నేహసంబంధమును పునఃస్థాపించి ఇటువంటి సంఘటన తిరిగి సంభవించకుండా వుండే

విషయంలో ఆ సమస్య పరిష్కరింపబడును. కాబట్టి కొందరు వారిలో పరిహారయోగ్యము కాని నేరమే వుండదు. ఖానూనును అతిక్రమించినప్పుడు సర్వసాధారణంగా ఆ జాతివారిలో విధించే ప్రాయశ్చిత్తమేమంటే ఆ జాతిలోని పెద్దలకు విందుచేయడమే అయివుంటుంది. ఒక నేరంవల్ల సంభవించే దుష్ఫలితాలను పోగొట్టుకొనే నిమిత్తమై ఆ జాతి పెద్దలందరూ ఒకచోట చేరడం చాలా అవసరం. ఒక నేరంలోగానీ లేక పోరాటంలోగాని చిక్కుకొనిన బంధువర్గపు పెద్దలందరూ, ఆయాగ్రామాల పెద్దమనుష్యులు ఇటువంటి సభలకు హాజరవుతారు.

ప్రతిగ్రామంలోను ఒక పెద్దమనిషి వుంటాడు. అతడు వంశపరంపరగా వచ్చిన గౌరవమును వహించియుంటాడు. అతడు ఈ అధికారం వహించినందుకుగాను ఏవిధమైన ప్రతిఫలమును పుచ్చుకొనడు. అతడు తనజాతి వారికి ప్రతినిధిగా వుంటాడు. పంచాయితీ సంఘాల ద్వారా పోట్లాటలలో తీర్పులు చేయబడును. ఆ తీర్పునిమిత్తమై పెద్దమనిషి, ఆ చుట్టుపట్ల గ్రామాల వృద్ధులు చేరి వుంటారు. నేరస్థులకు విధింపబడిన జరిమానాలు కల్లుక్రింద మార్చబడి దానిని అక్కడచేరిన సంఘ సభ్యులకు విందుగా త్రాగెదరు.

సాధారణంగా ఆ సమావేశం నేరస్థునిగ్రామంలో జరుపబడును. అతడు ఆ వచ్చిన పెద్దలకు ఆహారపు

ఏర్పాట్లు చేయవలసియుండును. ఒకసారి ఆ విందు జరిగిందంటే నేరస్థుని నేరము మాసిపోయి అతడు సంఘంలో సాధారణపరిస్థితిలో మెలగగలుగును. పెద్దమనిషి మరియు ఇతరపెద్దలు ఒకచో చేరడమనేది సాధారణంగా జరిగే సంఘటన కాదు. ఎంతవరకైతే ఒకడు తన క్షేమలాభాలను తాను జాగ్రత్తగా విచారించుకో గలుగునో అంతదాక అతడు తన అభియోగాలను ఒక సభముందు పెట్టడు.

మొత్తంమీద కొన్ని నేరాలను ఆ జాతివారు దండన కొరకు సభయెదుట ఉంచుతారు గాని ఖానూనుకు విరుద్ధంగా మతాంతర వివాహములు చేసుకొనే నేరముల విషయంలో మాత్రం ఆ జాతిలోని అందరు ఒక్కటిగా గూడి కఠినంగా శిక్ష విధిస్తారు. ఒక కొండజాతివానిని పట్టుకొనుటకు విప్పపూత పూచే ఋతువు చాలా అనుకూలమైనది. అప్పుడు నేరస్థులు వున్నచోటికి సమావేశపు పెద్దలు వెళ్ళి కొండజాతుల ఖానూనుకు విరుద్ధంగా నడిచినందుకు గాను నేరస్థులను అధికంగా జరిమానాలను చెల్లించేలాగు చేస్తారు. ఇటువంటి సభలు కేవలం శాసనమును పునరుద్ధరించుటకే గాక ఒకవేళ నేరస్థుడు తన సమస్యను పరిష్కరించవలసిందని కోరేయెడల ప్రజాభిప్రాయపు ఆధారంపై ఆ సమస్యా పరిష్కారానికి గూడా సమావేశమగును.

ఆ జాతి సభ్యులు ఏవిధమైన హెచ్చుమోటంలేని పద్ధతిలోనూ, ప్రతియొక్క కేసులోనూ కేవలం ప్రత్యేకంగా కలిగిన ప్రజాభిప్రాయంపైన మాత్రమే ఆధారపడిన విధంలోనూ తక్షణమే ఏర్పడిన న్యాయాన్ని అనుసరించి శిక్ష విధించెదరు.

వరంగల్లు జిల్లాలోని గహనారణ్యములలో వుండే కొండరెడ్లలో గానీ లేక రెడ్లలో గానీ గ్రామ పంచాయితీ యనేది ఒక ప్రత్యేక సంఘముగా లేదు. గ్రామప్రజలందరు ఒక సంఘంగా చేరెదరు ఆ సంఘంలోని వృద్ధుల మాటప్రకారం నడుచుకోబడును. బాధితులైన పార్టీవారు ఒక అభియోగాన్ని సంఘ నాయకునియెదుట ఉంచినప్పుడు ఆ విషయంలో చర్చలు సాగించుటకు అతడు గ్రామస్థులకు నోటీసుపంపి వారిని ఏకత్ర చేర్చును. సాధ్యమయినంత త్వరలో ఆ గ్రామస్థులు గ్రామంలోని ఒక సౌకర్యమయిన స్థలంలో సంఘ నాయకునియొక్క 'ప్యాజా' అనే గృహావరణంలోగానీ లేక ఊరిబయట ఒక చెట్టునీడలో గాని సమావేశమయ్యెదరు. ఇటువంటి సమావేశాలు "గూటీ" అనబడును. గ్రామసమావేశానికి సాధారణంగా పంచాయితీ సంఘమనే పేరుగూడా వాడబడును. అతి కఠినమైన నేరము చేసినప్పుడు ఆ కేసును పోలీసు విచారిస్తుంది. సంఘ నాయకుడూ, ఊరిపెద్దలు ఈ యిరువురి అధికార ఆవరణంలోగల కేసులు సాధారణంగా ఉన్నవి

గనూ, సివిల్ కేసులుగాను ఉంటును. ప్రస్తుతకాలంలో స్త్రీలకూ, వివాహప్రాబల్యములకున్ను సంబంధించిన కేసులే విరివిగా వస్తూవుంటాయి. కాని మతాంతర వివాహములు మరియు వ్యభిచారము లేక తక్కువ జాతివారితో కలిసి భోజనంచేయడం మొదలైన కులం తప్పులకు సంబంధించిన చట్టవిరుద్ధ నేరములుగూడా గ్రామ పంచాయితీ సంఘముచే విచారించబడును. వ్యభిచారనేరం చేసినవానిని కులంలోనుండి బహిష్కరించెదరు. బహిష్కారం విధించినవెంటనే కలిగేదేమంటే బహిష్కృతుడు ఏ రెడ్డి యింట్లోకిగూడా ప్రవేశించగూడదు. ఇంతేగాక ఏ రెడ్డి గూడా వానితోపాటు కూర్చొని భోజనంగానీ లేక వాని యింట్లో వండిన ఆహారం తినడంగానీ చేయడు. ఈ విధంగా వానిని అన్నివిధాలా వెలివేసెదరు. అయినను ఒకవేళ వారు వావితప్పినవారితో కుతంత్రంగాచేసే రంకుతనాన్ని మానుటకు ఇష్టపడుతూ గ్రామపెద్దలందరికీ విందుచేసే ఖర్చును భరించేయెడల అతడు పరిశుద్ధుడుగా చేయబడి తిరిగి కులంలో చేరడానికి అంగీకరింపబడును. చేసిన దోషము నివారించుటకుగాను ప్రాయశ్చిత్త రూపములో యివ్వబడే విందును "తాపులబంతి" అంటారు.

ఒకవేళ పంచాయితీ సంఘంవారు ఏలాంటితీర్పునూ చెప్పలేకపోయి తగాదాలు ఆదేవిధంగా జరుగుతూవుండే యెడల పార్టీలు, కుళంపెద్ద లేక కొండజాతుల నాయకుని

దగ్గర అప్పులు చేసెదరు. అతని అధికారం ప్రత్యేక గ్రామాధికార్ల అధికారంకన్నా పెద్దది. రెడ్డిసంఘపు కులంపెద్ద ఒక మతగురువుతో సమానుడు. కులంపెద్దల సివిల్ అధికారం అనేక గ్రామాలపైన వుండును. ఒక్కొక్క కులంపెద్ద అధికార ఆవరణంలో వున్న ప్రాంతం దాదాపు ఇప్పటి ఒకజిల్లా అంతవిస్తీర్ణంలో వుండును. కులంపెద్దల అధికారాలు వంశపరంపరగా వస్తూవుండును. ఆ అధికారం తండ్రినుండి పెద్దకొడుకుకు సంక్రమించును. పుత్రసంతానం లేకుంటే పురుషునికి సన్నిహిత సంబంధంలోవున్న మగసంతతికి ఆ అధికారం సంక్రమించును.

కులంపెద్దముందు ఏదైనా అభియోగం తేవలసియుంటే అది గ్రామపెద్ద తేవడం ఆచారమై వుండును. ఆ వివాదంలో తీర్పుచెప్పే నిమిత్తమై పంచాయతీసంఘం యేర్పరచబడును. అనగా సాధారణంగా నేరస్థుని గ్రామంవారు ఆ అభియోగ విచారణ సంఘానికి అధ్యక్షత వహించి పంచాయతీకిగాను ఒక దినమును నిర్ణయించే నిమిత్తం కులంపెద్దను ఆహ్వానిస్తారు.

కొన్ని సమయాలలో, గ్రామనాయకుడు ఒక పంచాయితీ సంఘాన్ని పిలిచి యేర్పాటుచేయుటకు సంసిద్ధుడుగా లేనప్పటికిన్ని గ్రామనాయకుడూ, నేరస్థుల గ్రామవృద్ధులు కలిసి కులంపెద్దదగ్గరకు పోయి అతనిని తమవెంట రావలసిందని కోరెదరు. అట్టి సందర్భంలో

పంచాయితీ సంఘ సభ్యులకు ఆహారవుపేర్పాట్లూ, వీలైతే తాగుడు యేర్పాట్లుకూడా పంచాయితీ సమావేశం జరుపబడే గ్రామనాయకుడే భరించవలసి యుండును. ఇట్టి ఖర్చులు ఒకవేళ తర్వాత నేరస్థునినుండి అతడు తిరిగి ప్రయత్నించి రాబట్టుకోగలిగినా యిప్పుడుమాత్రం అవి అతనికి తప్పవు. కుల పెద్ద అధ్యక్షతలో జరిగే పంచాయితీ సంఘ కార్యకలాపాలు సామాన్యమైన గ్రామ సమావేశాలవలెనే లాంఛనప్రాయంగా వుండగలవు. ఇందులో ఇవ్వబడే తీర్పు సాధారణంగా అప్పటి ప్రజాభిప్రాయాన్ని అనుసరించి వుండగలదు. అయిననూ, ఒకసారి కులంపెద్ద ఖానూనుప్రకారం తీర్పు యిచ్చినాడంటే అది కనీసం రెడ్డిసంఘం వరకైనా అంతిమ తీర్మానంగా భావించబడును. రెడ్డి సంఘాలకొరకు సివిల్‌కోర్టులు కలవు. గాని కొండజాతుల వారిమధ్య కలిగిన వివాదాల పరిష్కారము సివిల్ కోర్టులలో జరిగినట్లు యింతవరకు యెప్పుడుగూడా విన లేదు.

పూర్వకాలంలో వసూలైన జరిమానాల ధనం మొత్తం దాదాపు ౧౦౦ రూపాయిలవ్వేదాకా కులం పెద్ద తనయొద్దనే ఉంచుకొని ఆతర్వాత అతని అధికార ఆవరణంలో వుండే అన్నిగ్రామాల స్త్రీ పురుషుల కందరికీఆ ధనంతో విందుచేసే ఆచారం వుండెను. కాని ప్రస్తుతకాలంలో, జరిమానా వసూలుకాగానే దానిని ఖర్చు జేస్తున్నారు.

పంచాయితీసంఘ వ్యవహారముల విచారణలో అలౌకికమైన దైవాజ్ఞతత్వానికి అనుసరించడమనేది ఒక సూటిదప్పిన మార్గమే కాగలదు. అట్టి పంథాను కూడా వారు అనుసరిస్తున్నారు. ఒకమనిషి నేరము చేసినను అతడు తన తప్పును అజ్ఞానంచేత చేసినట్లు ఋజువు పరుచుటకు ప్రమాణం చేయడానికి అంగీకరిస్తాడు. భూమిని సాక్షిగా పిలుస్తూ దానిని తన అరచేతితో తాకుచూ అతడు ప్రమాణం చేస్తాడు.

"భూమి తల్లీ, ఈపని నేనుచేయలేదు. అట్లా చేసివుంటే నెత్తిపగిలి చావాలె" అని అతడు ప్రమాణం చేయును. అసత్య ప్రమాణముచేసిన నేరస్థుడు ఆ ప్రమాణంచేసిన మరునాడే మరణిస్తాడనీ, అతడు నేరస్థుడు కాని యెడల అతనిపై నేరం మోపినవానికి అపాయం కలుగగలదనీ వారిలో ఒక గట్టినమ్మకం కలదు.

గ్రామ పంచాయితీసంఘాల అధికారానికీ, కొండ ప్రాంతాలలో వాటికిగల అధికార ఆవరణానికీ ప్రభుత్వ అంగీకారము ఇవ్వగూడదనే విషయంలో సుదీర్ఘంగా ఆలోచించబడినది. ఎందుకనగా ఆదివాసులు అధికారం వహించడంలో ఇష్టపడుతున్నారనీ, పరిపాలనతో సహకరించడానికి సామర్థ్యం కలవారనీ వారికియిచ్చిన అధికార బాధ్యతా నిర్వహణం వల్లనే వారు రుజువు చేసినారు.

కొండజాతులవారి విజ్ఞాన దీపమునకు ప్రకాశమును కలిగించుటకున్నూ దానిని పెంపొందించే మార్గాలను కల్పించుటకున్నూ ముఖ్యములైన పంచాయితీసంఘాల ఏర్పాటు? కొండ ప్రాంతాలకు సంబంధించిన ౧౯౪౭ (౧౩౫౬ ఫ.) శాసనము (దస్తూరుల్ అమల్) లో చేయనైనది. అయితే కొండ ప్రాంతాలకు సంబంధించిన ౧౯౫౦ సంవత్సరపు శాసనం ప్రవేశపెట్టబడిన తర్వాతనే కొండ ప్రాంతాల నిబంధనలు ఏర్పరుచబడి ఆ ప్రాంతాలలో ప్రకటించబడినవి. ఇటువంటి ప్రాంతాలలో కొండజాతివాడు ఒక పార్టీగా చిక్కుకొనిన కేసులను విచారించుటకు న్యాయస్థానాలకుగానీ లేక రెవిన్యూ అధికారులకుగాని యేవిధమైన అధికారంలేదు. ఒక బహిరంగ దర్బారులో ఉభయపక్షాల యెదుట, కనీసం ముగ్గురు నిష్పక్షపాతులైన సాక్షులయెదుట, అన్ని కేసులలోనూ తీర్పుచెప్పే అధికారం యివ్వబడిన ఒక పంచాయితీ సంఘమును నియమించుటకు జిల్లా కలెక్టరుకు అధికారం కలదు. ఏ కేసులోగానీ వకీళ్లు వాదించడానికి అనుమతిలేదు. పంచాయితీసంఘ సభ్యులకు ౫౦ రూపాయిలకు మించకుండా వుండే జరిమానాను విధించే అధికారం కలదు. పంచాయితీ సభ్యులు, యుక్తమని తలచిన కొన్ని క్రిమినల్ కేసులలో. జరిమానాలను తిరిగి యిప్పించుటకుగానీ లేక నష్టపరిహారం యిప్పించుటకుగాని అధికారం కలవారైవున్నారు. అయితే శిక్షను

గానీ లేక ఖైదునుగానీ విధించుటకు వారికి అధికారంలేదు. ఉభయ పార్టీలు కొండజాతివారైవుండి వారు పంచాయితీ సంఘపు అధికార ఆవరణంలో వున్నమెడల సివిల్ ఖానూనుకు సంబంధించిన యెంత పెద్ద కేసులనైనా విచారించుటకు పంచాయితీ సభ్యులకు అధికారం కలదు. ఇదే విధంగా ఆ సంఘాలకు రెవిన్యూ అధికార ఆవరణం గూడా గలదు. పంచాయితీ సంఘాల విచారణాంశములను వ్రాత పూర్వకముగా రికార్డు చేయనవసరములేదు. ఇంతేగాక విచారణ చేయబడిన పార్టీల వాఙ్మూలాలపైన పార్టీలు సంతకం చేయవలసిన అవసరంగూడా లేదు. పార్టీల వాఙ్మూలం విన్నవెంటనే తీర్పు చెప్పబడును.

పంచాయితీ సంఘపు తీర్పుపైన అప్పీలు సహాయ ఏజంటు యెదుట జరుగును.

ఈ విధంగా అమాయకులూ, దరిద్రులూ నైన ఆదివాసులు వారి శక్తి సామర్థ్యాలకు మించినవి మాత్రమే కాక వారి ఆటవిక పద్ధతులకున్నూ, ఆటవిక సంప్రదాయములకున్నూ తగని కోర్టు వ్యాజ్యములనుండి గూడా వారు కాపాడబడినారు.

---

# ఆదివాసుల సంఘనాట్యములు

హైదరాబాదు సంస్థానములోని ఆదివాసులలో అధిక సంఖ్యాకులైన గోండులు ఆదిలాబాదు జిల్లాలోని పర్వత ప్రదేశాలలోనూ అడవులలోను ప్రత్యేకంగా నివసించివుంటారు. వారి పురాతన ఆటవిక నాగరకతనూ, వారి స్వభాషను జాగ్రత్తగా కాపాడుకుంటూ వున్నారు. చలికాలంలోని తొలి రోజులలో అనుభవించే ఉల్లాసము గోండులలో నశించలేదు. దసరా తర్వాత రెండుమూడు వారాలదాకా అన్ని పనులను వారు ఆపివేసి, వారు నివసించే పల్లెప్రాంతాలంతటా అత్యధిక సంతోషంతోను, ఆటపాటలతోను గడిపెదరు. ఆ కాలంలో యువకులు జట్టులుగా బయలుదేరి అందమైన దుస్తులు ధరించి, వివిధ వాద్యములను వాయిస్తూ ఊరూరు తిరిగెదరు. వారుపోయిన ఊర్లలోనెల్లా వారికి ఘనమైన స్వాగతమూ, ఆతిథ్య గౌరవము ఇవ్వబడును. "డుండ్రియారాపుర్, సిపిసెర్మారాపుర్" అనబడే చారిత్రక వీరులచేత ప్రారంభించబడిన నాట్యపద్ధతిని ప్రతి సంవత్సరమున్ను అనుసరిస్తూవున్న దండారీ నాట్యకాండ్లే వీరు. ఆ సమయములో అమితముగా ధనవ్యయముచేసి అతి ఉత్సాహముతో అతిథులకు విందులు జరుపుతారు. దీనికి బదులుగా

అతిథులు ప్రొద్దుగుంకినప్పటినుండి సూర్యోదయందాకా రాత్రియంతయూ విరామమూ, విశ్రాంతి లేకుండా ఆటలూ పాటలతో తమకు విందుచేసిన వారికి వేడుక కలిగిస్తారు.

దండారీలు దేశంలో సుగ్రీవాజ్ఞను చెలాయిస్తున్న కాలంలో ఈ చరిత్మాత్మకమైన నాట్యము వ్యాపించింది. నాట్యాంగమైన నగారాలు చేసేపద్ధతీ, స్నేహ సంబంధము గల గ్రామాలకు నాట్యకాండ్లజట్టులు పోయే పద్ధతి ఈ చరిత్రలో చెప్పబడినవి. ఈ పద్ధతులు అయిదు గురు సోదరుల తెగకు చాలా ముఖ్యుడూ, పూర్వీకుడు నగు దుండిప్రియారావుర్ చేతనూ, అయిదుగురు సోదరుల తెగకు కులదైవంగా నేటికాలంలో గౌరవింపబడే మాంకో చేతను ప్రారంభింపబడినవి. దండారీల చారిత్రక పూర్వపురుషుల చేత కాపాడబడుచుండిన ఆజాతి నాగరకత, పద్ధతి ఆ నాట్యంలో ఉన్నదని దండారీలు తలుస్తారు. ఆ నాట్యం తమకు ఉత్సాహన్ని కలిగించేది మాత్రమేకాక తమ మత సంబంధమైన విధిని గూడా నెరవేర్చే వేడుకగా వారు భావిస్తారు.

నాట్యంలో వారు ఆరాధించే దేవతపేరు "యెత్మ సారీపెక్" అని అంటారు. కొందరు ఆ దేవతను పురుష దేవతగా భావిస్తారు. ఆ దేవత వర్తులాకారంలో వున్న ఒక నగారారూపంలో వుంటుంది. దానిని వారు నాట్యములు చేస్తూ గ్రామగ్రామాలకు విహారార్థమై వెళ్లే సమయంలో

వెంట తీసుకపోయెదరు. మార్గమధ్యంలో నంతా దానిని వాయిస్తారు. ఒక గ్రామంలో ప్రవేశించేటప్పుడు మాత్రం ఆడుతూ పాడుతూ ప్రవేశించరు. నెమలి యీకెలతో కప్పబడిన "అగ్రుసీ, బగ్రుసీ" అనే యిద్దరు దేవతలు "యెత్మసార్ పెన్" అనే నాట్యదేవతను అనుసరిస్తారు. ఆ నెమలి యీకెల దేవతలను కృత్రిమముఖములు ధరించిన వేషంలో వున్న 'గుసారి' అనే గోండు నాట్యకాండ్లు ధరిస్తారు. ఆ గుసారీలు అన్ని నాట్యపు యాత్రలలోనూ వెంట ఉంటారు.

దండారీ నాట్యకాండ్లు ఒకటే పంక్తిగా పెద్ద పెద్ద అంగలు వేస్తూ వస్తారు. మొట్టమొదట దివిటీలు పట్టుకునే వారు, వాద్యములు వాయించేవారు నడుస్తారు. ఆ తర్వాత భుజములకు "డప్పు" వాద్యములు వ్రేలాడగట్టుకొనియున్న చిన్న చిన్న బాలురు నడుస్తారు. ఇతరులు మెడకు వాద్యములు వ్రేలాడవేసికొని వాయిస్తూ వస్తారు. "ప్రధాన్" అనే వాడు ఒక పెద్ద లోహపు కొమ్మును వాయిస్తూ వస్తాడు. అందరికన్నా వెనుక నాట్యకాండ్లు గల్లుగల్లుమనే కాలి అందెలూ, నిగనిగ మెరిసే వెండినగలు ధరించి వస్తారు. చిన్నచిన్న బాలురు, బాలికల వేషంలో వస్తారు. వారు పొడుగాటి అంగరఖానూ, మెడకు ముడివేయబడ్డ అంగవస్త్రమునూ, చీరెనూ, బ్లాంకెటు కుళ్ళాయినీ ధరిస్తారు. ఇదే వారి బాలికా వేషము. వారివెనుక యువకులు ధోవతులు కట్టుకొని అంగీలు, కోట్లు తొడిగికొని, తళతళ మెరిసే అనేక ఆభరణాలు ధరించి వస్తారు. ఇద్దరుయువకులు గుమే

లావాద్యములను మోసికొని వస్తూవుంటారు వారి భుజము లకు మంటి వాద్యములు వ్రేలాడగట్టబడి యుండును. కాని ఇవి సాధారణ పరిస్థితిలో ఒక ఊరిలో ప్రవేశించే సమయ మునందు వాయించబడవు. కొందరు వృద్ధులు చేతి కఱ్ఱలను ధరించి ఆదరికంటె వెనుక నాట్యకాండ్లను అనుసరించి వస్తారు. అయితే ఈ సంఘంలో స్త్రీలు ఉండరు.

యువకులు నగారాలనూ, ఢంకాలను, డప్పులను వాయిస్తూ ఘనమైన స్వాగతమిస్తారు. ఈ స్వాగతము, మండపంలో ఊరేగింపు ఆగగానే యివ్వబడును. స్వాగత వాద్యములు వాయించేవారు మండపం ప్రక్కలలో చుట్టు కొనియుండి దండారా అతిథుల పొడుగైనపంక్తి పూర్తిగా మండపంలో చేరేదాకా రెండువిధములైన వాద్యములూ వాయిస్తూ వుంటారు.

మృదువైన వాద్యధ్వని వినగానే నాట్యకాండ్లు వారి నాట్యపుకఱ్ఱలను తీసుకుంటారు. ఆ కఱ్ఱలు చక్కగా తీర్చ బడిన నల్లనుట్టివి. వాటిలో కొన్ని ఇత్తడి పిడిగలవి. వాటిని పట్టుకొని నాట్యకాండ్లు, ఆ మంటపంలో వలయాకారంగా తీరి వుంటారు. ఆ వలయంలో బాలబాలికలు ఒకరితర్వాత మరియొకరు రాసక్రీడలోవలె నిలిచియుంటారు. బాలురు పొడుగాటి అంగరఖాను ధరించి యుంటారు. గుమేళానా ట్యముయొక్క మృదువైన తాళధ్వని రాత్రియందలి ప్రశాంత వాయువులో తేలిపోవుచుండును. ఆ ధ్వని ప్రేక్షకుల పర

స్పర వ్యర్థ సంభాషణములను ఆపి వేసి వారికి ఆనందమును గలిగించుచుండును. ఆ తర్వాత నాట్యకాండ్లు వారి చేతిలోని కఱ్ఱలను పైకియెత్తి మెల్లమెల్లగా అడుగులు వేయుచు అప్రదక్షిణముగా తిరుగుటకు ఆరంభించెదరు. వారు ఈకోలాటనాడేటప్పుడు లోపలివైపే ముఖముచేసి ప్రక్కలకు నడుచుచున్నట్లు పాదములను దాటుచూ. కోలాటపు కఱ్ఱలను తొలుత తమచేతిలో కఱ్ఱలనుకొట్టి పిదప కుడివైపువాని కఱ్ఱను తట్టి తిరిగి తనదానిని కొట్టి ఆ తర్వాత యెడమవైపు వాని కఱ్ఱను తట్టెదరు. అదీ కోలాటమాడేపద్ధతి. ఇది పరస్పర అభినందననాట్య మనబడును. దీనితో అసలు నాట్యమారంభమగును ఈ అభినందన నాట్యమునకు "మార్ కోలా" లేక "సార్ కోలా" అని పేరు. అభినందన నాట్యమని పేరు దాని కెందుకు వచ్చిందంటే దండారినాట్యకాండ్లు ఎవరైనా వచ్చినప్పుడు వారికి స్వాగతమూ, వీడ్కోలు, ఈ నాట్యముతోనే యివ్వబడును. ఈ విధంగా వలయాకారంలోవున్న నాట్యకాండ్లు అభినందన నాట్యంచేసి తిరిగి యథాస్థానానికి చేరుకున్నతర్వాత ఆ నాట్యంలోఆడిన బాలికావేషధారులు వారున్నచోటనే నిలుచుకొనియుండెదరు. నాట్యమాడే బాలురు ఆ బాలికలముందుకు అడుగువేసి కోలాటములు కొట్టుచు ఒకచోటికి చేరెదరు. నాట్యమాడే బాల బాలికలను పుంజు పెట్టలు అని అంటారు. మరల ఆ వలయం గుండ్రముగా ఏర్పడేదాకా ఇదేవిధంగా చేస్తూవుంటారు. ఆ తర్వాత నాట్యకాండ్లందరు వంగి తమచేతి కోలలతో భూమినితా

కుచూ తూర్పువైపు దేవతలుంటారు కాబట్టి ఆ వైపునకే చినచిన్న అడుగులువేసి నడుస్తూ పోతారు. ఆ తర్వాత వారు క్రమంగా పడమర, ఉత్తరం, దక్షిణపు వైపులకు తిరిగి నడుస్తూ అన్నిదిక్కులలో వున్న దేవతలకు వందనములు చేసెదరు. తిరిగి వారు తమవలయమును యేర్పరచుకొని క్రింద కోలలను తమ పాదములకడ వుంచి చప్పట్లు చరుస్తూ పాటలు పాడెదరు. పాటకాండ్లు వారిభాషలో "గుమేలా పాట" అనేపాటను పాడెదరు. ఇది మిక్కిలి ఇంపైనపాట లలో ఒకటి. దీనిని రెండు మంటి వాద్యముల శ్రుతితో పాడెదరు పాటకాండ్లలో ఒకజట్టు పాటపాడెదరు. రెండ వజట్టువారు ఆ పాట చివరి నొడుగును అందుకొని పాడె దరు. ఈ నొడుగును ప్రతివాక్యము కొరకు పాడెదరు.

ఇది సంవత్సరాని కొకనాడువచ్చే అకారీ అనే పం డుగదినం సందర్భంలో పాడెదరు. ఈ పాటను ఆ జాతి పూర్వీకులైన అయిదుగురు సోదరులు పాడుటకుప్రారంభించి నారు. ఆనాటినుండి నేటిదాక పరంపరగా అకారీ పం డుగనాడు ఆ జాతివారు పాడెదరు. ఈపాట పాడుతూ చేసే నాట్యమునకు "నాట్యపువిందు" అనిపేరు. ఇందులో దేవ తలస్తుతి వున్నది. వేడుకలు, విందులకు సంబంధించిన విష యాలు చాలావున్నవి. ప్రతిపాదం అంత్యంలోనూ సోదరా అని సంబోధన కలదు. ఈ పాటలో కొంతభాగముదాక పాడి ఆపైన పాటకాండ్లు ఆపుజేసెదరు. ఈ భాగం దండా రీనాట్యకాండ్లు వచ్చినపుడల్లా పాడే ఆచారం కలదు.

ఆ తరువాత కొంతసేపటికి మిగతా పాట ఇంపుగాపాడెదరు. ఆభాగంలోగల అర్థమేమంటే, 'దేవతలతో మేము గుండ్ర ముగ తిరుగుతున్నాము. వారిదయచే నాట్యపు దుస్తులను ధరించినాము. మీకొరకు వంగి నాట్యము చేయుచున్నాము. మీ దయచే నాట్యపుదుస్తులను ధరించినాము. మీరురాగానే నాట్యము ఆపుతున్నాము. కులదేవతలను, పెద్దదేవతను, భీమనను మేము కొలుస్తాము' అని వారు దండారీ నాట్య కాండ్లను ఉద్దేశించి యీ పాట పాడెదరు.

నాట్యకాండ్లు ఈ పాటనుమార్చి వేరేవిధంగా పాడు టను "సద్దిా కోలా" లో ఆరంభించెదరు. ఈ సద్దిాకోలా టమః సార్ కోలాటములో వలెనే ఆటకాండ్లు వలయాకా రంలో నిలబడి ఆడెదరు. ఆ యాటలో బాలబాలికలు ఒకరి తర్వాత ఒకరు ఆటకాండ్లుగా నిలబడివుంటారు. వారు మెల్ల మెల్లగా ప్రక్కకు అడుగులువేస్తూ కుడి యెడమవైపుల కోలలకు తమచేతి కోలలను తట్టుచుందురు. వారు అప్రద క్షిణముగా తిరుగుచుందురు. ఈ విధంగా అరువది పర్యాయ ములు కోలలు తట్టిన తర్వాత బాలికలుమాత్రం ముందుకు సాగి లోపలి భాగంలో వారు మరియొక వలయంగా ఏర్పడి ఒక్కొక్క బాలిక ఒక్కొక్క బాలునకు అభిముఖంగా ఉండేలాగు నిలుచుండెదరు. ఆతర్వాత బాలికలు ముందుకు రెండుసార్లు, వెనుకకు రెండుసార్లు అడుగులు వేయుచూ, వారి ఉజ్జీల కోలలకు తమ కోలలను తట్టుచు ఆడెదరు. అలాగు ఆడుకుంటూనే ఐమూలగా బాలకుల నడిమిదారి

నుండి ఆ వెలుపలికిపోయి తిరిగి వలయాకారంగా నిలబడెదరు. అప్పుడు వెంటనే బాలురు లోపలి వలయంలోనే వుండి తిరిగి బాలికలకు అభిముఖంగా నిలబడెదరు. ఈ విధంగా బాలబాలికలు లోపలి వలయంలోకీ, బయటి వలయంలోకీ ఒకజట్టు తర్వాత మరియొకజట్టు ప్రకారం మారుతూ ఆడెదరు.

ప్రజలు సద్దికోలాటమును చలిస్తూవున్న చిటచిన్న నెగళ్ళమంటల వెలుగులో దయ్యములవలె ఉల్లాసములో ఆడెదరు. అప్పుడు గ్రామవీధిలోనుండి వింతయైన వ్యక్తులు ముగ్గురు హఠాత్తుగా ఈ సంఘంలోకి దూరిపడెదరు. వారు మిక్కిలి పెద్దపెద్ద అంగలు నక్కినక్కి వేస్తూ వారి చేతుల లోని దుడ్డుకఱ్ఱలతో పైకెగిరి ఆటకాండ్ల భుజముపైన నడుస్తారా అన్నంత దిగ్భ్రమ కలిగిస్తూ వారిపైన పడెదరు. వారు, అక్కడ ఆడుతున్నవారిని అభినందించకుండానే నిర్లక్ష్యముచేస్తూ వికారములూ, అమంగళములూ నైన ముఖాలతో ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు ఆ నెగళ్ల వెలుగులోవున్న జనసమూహానికి వెలుపటివైపుగా గుండ్రముగా తిరిగెదరు,

ఈ లోపుగా యింకొకపాట తయారుచేయబడును. ఉద్రేకము అణగిపోగానే గుసరీ హాస్యగాండ్ల చమత్కారముగూడా నిలిచిపోవును. ఆ తర్వాత పిల్లల అల్లరు తిరిగి ప్రారంభమగును. ఒక పిల్లవాడు ఆడపిల్లవేషం వేసుకొని

తలపైన ఒక గంప పెట్టుకొని రంగంలో ప్రవేశించును. ఆ తక్షణమే ఆ బాలికావేషధారిని ఒక బాలకుడు పలుకరించును. అతడు చేతిలో ఒక కఱ్ఱను పట్టుకొని రంగస్థలంలో ఎదుటివైపుగా వణకుచూ ఉండును. ఆ బాల బాలికలిద్దరూ ఈ క్రిందివిధంగా ఒండొరుల సంవాదరూపంలోవున్న పాట పాడెదరు.

బాలకుడు:- దారినిబోయ్యే ఓపిల్లా నీకులమేమి?

బాలిక:- నా కులమడుగుటకు నీవెవరవు? భార్యను మొదువు పెట్టుకున్న నిన్ను నా పాదాలక్రింద త్రొక్కివేస్తాను.

బాలకుడు:- నీ పాదములను నాయెదపై పెట్టుకుంటాను— మనమిద్దరము కలిసి ఒక కల్లుదుకాణమునకు పోదాము—భార్యాభర్తలవలె ఒకచో కూర్చొని కుండలోనుండి మద్యమును తీసుకొని త్రాగుదాము.

బాలిక:- ఈ గంప, విసనకఱ్ఱ నీవు తీసుకొమ్మా, నీ చిన్న తమ్ముని నేను తీసుకుంటాను.

# కొండరెడ్ల నాట్యము

వరంగల్లు జిల్లాలోని పాలవంచ దగ్గరవున్న నదీ తీర భూములలోని బైసన్ కొండలలో నివసించే కొండరెడ్లలో స్త్రీ పురుషులిద్దరూ ఒకేసారిగా నాట్యరంగాన్ని చుట్టుముట్టి అప్రదక్షిణంగా నాట్యం చేసెదరు. అయినా గాని వారు ఒకవర్గంతో మరియొకవర్గం కలియకుండా స్త్రీ పురుషులు వేర్వేరు వర్గాలలో ఆడెదరు. ఆ స్త్రీ పురుషుల నాట్యములు పరస్పర సంబంధమేమీ లేకుండా వుండును. పెద్దపెద్ద ఉత్సవ సందర్భాలలోగూడా వారు ఒండొరులు కలిసి మెలిసి తిరుగరు. వారి నాట్యాలలో గూడా వారు వేర్వేరు భావప్రకటన చేసెదరు. నాట్య సమయంలో స్త్రీలు పొడుగాటి జారుడుఅంగలు నాలుగు వేసెదరు. కుడిపాదమును ఐమూలగా మూడుసార్లు ముందుకు, వెనుకకు ఒకసారి చాచెదరు. దీనిలో భుజములను ఊగులాడించుటచేతనూ గిలక కట్టుకిరింద కొట్టుట చేతను అధికమైన నాట్యవేగము గలిగి దానిచేత మిక్కిలి ఉత్సాహముగానుండును. ఆ తర్వాత జారుడుఅంగలు వేయుట మాని అదేగానమును ఉత్సాహంతో పాడెదరు. కొన్ని వేళలలో ఈ నాట్యమునకుబదులుగా వేరే రెండు ఇతర నాట్యములు చేసెదరు. అందులో ఒకటి ప్రిక్కను మళ్ళకుండా

బహిరంగముగా వరుగెత్తే ఆకని నాట్యము (తాండవము); రెండవది, ఆగియాగి వెనుకకు వంగుచూ కాళ్లు వెడల్పుగా చాచుచూ, కుడికాలిపైన ముందువైపు వంగుచూ, ఎడమ కాలిపైన వెనకవైపు వంగుచూ, రెండుకాళ్లూ కత్తెరవలె జోడించుచూ, ముందుకూ వెనుకకూ వంగుచూ భావప్రక టనలతో నాట్యములు చేసెదరు.

పురుషుల అంగలు అంత సక్రమంగా వుండవు. వారి అభినయములుగూడా స్పష్టంగా తెలియవు. మద్దెల వాయించువారు పక్కగా నడుస్తూవుంటారు. అయితే వారివెనుక ఇతరపురుషుల జట్టు వుంటుంది. నడిచేవైపు వారి భుజములు చదరంగా వుండును. వారు నాట్యపు ప్రాథమిక దశలలోనూ, నాట్యరంగపు మధ్యభాగంలో సంఘంగా కూడివున్నంతవరకున్నూ ముందుకే సాగుతూ వుంటారు. వారు వాహ్యాళికి కులాసాగా నడుస్తున్నట్లు గానీ లేక కులాసా నాట్యరూపంలోగానీ నడుస్తుంటారు. ఆ నడకలో ఎల్లప్పటికిని కుడిపాదం ముందుకు సాగుతుం టుంది. ఎడమపాదం మెడిమపైననే ఆగుతూ వుంటుంది. ఇట్లు ఆగడం కేవలం కుడిపాదం అడ్డులేకుండా ముందుకు సాగడంకొరకు మాత్రమే చేయబడును. మొత్తంమీద ఈ నాట్యము స్త్రీల నాట్యమును అనుసరిస్తూ వుంటుంది. అనగా స్త్రీలు చేసే అభినయమునే తిరిగి వీరు చేస్తూవుం టారు. ఆతర్వాత మొదటిది విడిచి రెండవది అనుసరం

చడం, తర్వాత మొదటిది, రెండవది, ఈ విధంగానే నాట్యంచేస్తూ వుంటారు. అయితే అభినయములో ఒక విధమైన యేర్పాటుగానీ లేక నాట్యకాండ్లు యేర్పరచుకున్న నమూనాలు గానీ యేవీ లేవు.

బుడుబుడుక్కలవంటి డక్కీలు పట్టుకున్న పురుషులు తమ కుడి అరచేత వాటిని అడుగడుక్కూ కొట్టుచుంటారు. అయితే గుండ్రివు డక్కీలను పట్టుకవచ్చేవారు ముందుకు సాగుతుండే అడుగులవెంటనే వెళ్ళుతూ డక్కీలను ఎడమ చేత వెనకపాదం ఆగేదాకా కొట్టుతూ వుంటారు. నగారా కట్టలతో వెంటవెంట డక్కీల లోపలిభాగంలో కొటుతూ ంటారు.

నా ్యం జరుగుతూనే వుంటుంది. తొందర తొందరగా పాటలు పాడుతూవుంటారు. కొందరుస్త్రీలు నాట్యం మాత్రం చేస్తూవుంటారు. ఎప్పటికీ ముగియకుండా వుండే యీ క్రిందిపాటలు పాడుతుంటారు:—

గోగులపూడీ ముత్యాలమ్మా
నీకూ సంబరం చేస్తున్నాము.
కొండలలోనీ కొండదేవతలూ రావాలె,
భూమిలోవున్నా భూమితల్లి మీరు రావాలె,
తేరం కొండ చినామి మీరు రావాలె,
గురవరాతి కొండ తామరాజు మీరు రావాలె,

పందికొండ కనంరాజు నీవు రావాలె,
కోవెలకొండ కనంరాజు నీవు రావాలె.

ఈ నాట్యంలో తాళం క్రమక్రమంగా వేగము హెచ్చుతూ పాటపాడుట తగ్గిపోవును. ఇట్లు జట్లుగా వుండడం సడలిపోయి సంఘంలోనుండి వేర్వేరుగా వ్యక్తులు విడిపోవుదురు. వేరుగా పోయేటప్పుడు వారు ఒంటికాలి మీద దుముకుచూ, ఎగురుచూ, గంతులు వేయుచూ మరల మొనిమిదిమందిగల వలయములుగా యేర్పడెదరు. ఆ తర్వాత నాట్యము గంటలకొలది ఆడెదరు. నగారాలు ఎడతెగని ఏకధ్వనితో కొట్టుతూ వుంటారు. స్త్రీ పురుషులిద్దరూ వారికి ఉత్సాహం పెరిగేకొలది అది ఆడించినట్లా పెద్ద పెద్ద నినాదములు చేస్తూ కేకలు వేసెదరు. అప్పుడు నాట్యంగూడా అతి ఉద్రేకపూరితంగా పెరుగుతూ వుంటుంది. ఈ సమయంలో హాస్యముచేయుటకూ, ఎత్తిపొడుపుమాటలకు సంబంధించిన పాటలోని చిన్నచిన్న వాక్యాలను పాడుటకు ఆరంభించెదరు.

బల్లున తెల్లవారేదాకా నాట్యం అతి ఉద్రేకంలోనే ఉంటుంది. ఉదయం ౧౦ గంటలయ్యేటప్పటికి ఊగుతూ, వణకుతూ ఆడే ఆఖరు నాట్యకాడు తన డక్కీనితీసి ఆటను చాలిస్తాడు. అప్పుడు ఊరంతా మాటుమణిగి నిశ్శబ్దంగా వుంటుంది.

కోలాటము:— ఈ యాటను కొండరెడ్లు నదీదేవత గౌరవార్థంగా ఆడెదరు. ఈ యాటలో ఇతర అనేక కులాలవారు, ఒరిస్సా జాతులవారు, మధ్యభారతదేశపు జాతులవారివలె; వీరు అంతగా నిపుణులుగారు. అయినప్పటికిన్నీ ఉత్తరంవైపు పర్వత ప్రాంతాలలోవున్న రెడ్డి జాతివారిలో ఈ యాట చాలా విరివిగానూ, సర్వజనాదరణీయంగాను ఉన్నది. ఈ యాట ఇంతదాకా గోదావరీ ప్రాంతంలోని రెడ్లకు తెలియదు. ఉత్తరవైపు పర్వతప్రాంతాలలోని రెడ్డిజాతివారి స్వచ్ఛంద నాట్యాలకన్నా ఇది ప్రత్యేక ఉత్సాహంతో కూడియుండును. కోలాటము పురుషులు, ముఖ్యంగా యువకులే ఆడెదరు. వారు చిన్నచిన్న వెదురు కోలలతో ఈ యాట నాడెదరు. ఆ కోలలతోనే వారు తాళమును గుర్తుపెట్టుకొనెదరు. తాళ సూచకములైన డక్కీలు మొదలగు యితర వాద్యము లీయాటలో వాడుకోరు. ఈ యాటకాండ్లు గుండ్రముగా నిలుచుకొని యుండెదరు. ప్రతి ఆటకాడూ ఆ యాటక్రమమును పరిపూర్ణంగా పాటిస్తూ వుండును. ఆటలో ఎంతమంది పాల్గొన్నా ఈ క్రమాన్నే అనుసరిస్తూ వుంటారు. ప్రతి ఆటకాడు అడుగులు వేయడం, ఊగడం మొదలైనవి ఇతర ఆటకాండ్లవాటిని అనుసరించియే యుండును. ఆటక్రమాలలో అందరికీ అతి ఇష్టమైనది గొలుసు వలయము. అది ఆడేటప్పుడు వారు అడుగడుగునకూ కులాసాగా పాడుతూనో లేక గంతులువేస్తూనో ఆడెదరు.

———

# చెంచు నాట్యములు

మహబూబు నగరం జిల్లాలోని అమరాబాద, ఫరహాబాద కురువులలోని చెంచులలో మొట్టమొదట నాట్యానికి సిద్ధమయ్యేవారు స్త్రీలే. వారి నాట్యము మిక్కిలి శాస్త్రీయంగా వుంటుంది. ఇంతేగాక ఆ నాట్యము కులాసాగా పాడుతూ ఆడుతూ వుండే సక్రమ పద్ధతులకు అనుగుణ్యంగా వుంటుంది. వారు నాట్యం చేస్తూ వున్న విధానికి తగినట్లు వారి శరీరాన్ని ముందుకూ పైకీ వంచుతూ యెత్తుచూ వుంటారు. సుళువుగా పైకి లేచి క్రిందకి అణుగుతూ వుండే మెడిమలచేత అడుగడుగునా వారు నాట్యపు లయకు అనుగుణంగా ఆడుతారు. వారు వలయాకారంలోనో దంపతులుగానో లేక యెనిమిదిమంది కలసి ఒక జట్టుగానో ఆడెదరు. వారు ఆడే నాట్యపు పద్ధతులన్నీ సమప్రాంతాల ప్రజల నాట్యములనుండి యెరువు తెచ్చుకున్నవే.

నాట్యరంగంలో ఒకని వెంట ఒకడు క్రమంగా పురుషులు ప్రవేశింతురు. ఈ విధంగా పురుషులందరు నాట్యరంగంలోకి వచ్చినతర్వాత యుక్తిగా వారు స్త్రీలలో దూరెదరు. స్త్రీపురుషుల నాట్యములలో అంతగా భేదము

గోచరించదు. వాద్యములుగూడా వాయించడం ఆపబడదు. కాని మొదటి పురుషుడు వచ్చిన కొన్ని నిమిషాలలోనే ఒక్క స్త్రీగూడా లేకుండా అందరూ నాట్యరంగము విడిచిపోయెదరు. అప్పటినుండి ఆ రంగమును పురుషులే ఆక్రమించుకొని ఆడెదరు.

పురుషుల నాట్యానికీ స్త్రీల నాట్యానికీ ముఖ్యంగా భావంలోనే పరస్పరభేదం కలదు. ఎందుకనగా, స్త్రీలు నిర్ణీత పద్ధతుల ననుసరించియే నాట్యం చేసెదరు. పురుషులు కొన్నికొన్ని పాటల ఛందస్సుకు అనుగుణంగా వారి సొంతభావాలనే కల్పించుకొని పాడుతూ నాట్యం చేసెదరు. పురుషుల నాట్యాలలో ఒకజట్టుగా కూడడమనే నియమంలేదు. ఎవనికెప్పుడు బుద్ధిపుట్టితే అప్పుడే పోయి నాట్యంలో చేరి ఆడుటకు ఆరంభించును. వాడు ఆడునప్పుడు వేసే అడుగులుకూడా తనయిష్టం వచ్చినట్లే వేయును గాని ప్రక్కవారికి అనుగుణంగా వేయడు. వాడు ఆడి ఆడి అలసినప్పుడు క్రింద పడిపోతాడు. వాడు ఒకవేళ తిరిగి తాజాగా అయినా గాని వాని శక్తిమాత్రం అల్పంగానే వుంటుంది. ఈవిధ నాట్యరంగం అరుదుగా ఖాళీ పడినప్పటికిన్ని ఒకప్పుడు గుంపులుగుంపులుగా జనం ఆడుట ఒకప్పుడు ఒక్కడే ఆడుట సంభవించుచుండును.

పురుషుల నాట్యము నాటకంలో వుండేరీతిగా ఉండును. వారు నైసర్గిక నాట్యములను ఆడెదరు. తరుచుగా

వారి నాట్యములలో చెంచు జాతివారి జీవితానికి సంబంధించిన అంశములనే అతిశయోక్తులచే ప్రదర్శిస్తూ ఆడెదరు. ఆ నాట్యములకొరకు ఆహ్వానింపబడే పాత్రల ప్రవేశములు నాట్యపు లయచేతనే జరుగును. కొన్ని వేళలలో పురుషులు దేహమంతా బూడిదె పూసుకుంటారు. అప్పుడప్పుడు వారు ధరించే గోచి బట్టకు బదులుగా ఆకుల కొమ్మలచేత వారి రహస్య అంగమును కప్పిగాని లేక దిగంబరులుగా గాని నాట్యం చేసెదరు.

అన్నివిధములైన నాట్యములలోనూ తాళము కచ్చితముగా అనుసరించబడును. వాద్యము మీద దెబ్బ వేయడం, నాట్యములో అడుగులు వేయడం ఈ రెండు ఒక్కసారిగా జరుగును. ఈ రెండున్ను పాటలకు అనుగుణంగా వుండును. నాట్యకాండ్లు త్వరత్వరగా నటించే కొలదీ వాద్యములమీదబడే దెబ్బల వేగం కూడా రెండంతలగును. కాలం వేగంగా గడిచేకొలదీ చెంచువాడు నాట్యంలో చిన్నచిన్న అంగలు వేస్తూ వుండును. వాద్యములు వాయించడం పూర్తిగా ఆపుచేసేదాకా నాట్యకాడు వంకరగానూ, మలుపులుగానూ గంతులువేస్తూ, దుముకుతూ ఆ చిన్న నాట్యరంగంలోనే ఆడుతూ వుంటాడు. నాట్యకాండ్లు అలసిపోయినప్పుడు వాద్యకాడుకూడా తన వాద్యమును మెల్లమెల్లగా వాయిస్తూ వుంటాడు. నాట్యకాండ్లు మరియొకసారి నాట్యరంగాన్నంతా ఆవరించుకొని

నిలుచుంటారు. ఆ తరువాత వారు పాదమును ముందుకు చాచి ఒక్కొకరిగా భూమిపై గట్టిగా పాదముతో తన్నెదరు. మోకాళ్ళు వంచుచున్నూ, చాచుచూ ఆడెదరు. కొన్ని వేళలలో వారు ముందుచాచే పాదమును క్రిందుగా శరీరమును త్రిప్పి ఆడెదరు.

**నెమలిఆట:-** ఈ ఆట సెంచులకు చాల యిష్టమైనది. ఈ ఆటను విల్లుమ్ములు ధరించి తేనెబట్టను పిరుదులకు కట్టుకొనెదరు. ... మొద్ద సాక్షి వుంటే అది వాని శక్తిని చేకూర్చును. అయితే ... పనిముట్లు వారి దగ్గర ఉన్నా అవి పూర్తిగా ఉపయోగింపబడును. నెమలి ఆటలో వేటకు సంబంధించిన సాంకేతిక విజ్ఞానమంతయూ అనుసరించి ఆడబడును. అడవులో ప్రాకుట, చెట్లకు దాపుగా నిలుచుట, ఒక నెమలిపై దెబ్బ కొట్టుటకు పొంచియుండుట, జంతువుపై గురిపెట్టే అప్పుడు అకస్మాత్తుగా శరీరమును ముడుచుకొనుట, బాణమును గురిపెట్టుట, వింటిని ఎక్కుపెట్టుట, ఈ మొదలైన పన్నుగడలను ప్రదర్శించుటవలన అచిరకాలంలోనే ఆ జంతువుపై గెలుపు పొందవచ్చును; లేదా అరగంటకాలం ఆలస్యం కావచ్చును; అనే భావం ప్రేక్షకులకు ఆటకాని భావ ప్రకటనవల్ల గోచరించును.

కొండకుర్రవ్వలఆట—నల్లనిముఖముగల కోతులు:— ఈ ఆటలో నేమివిధమైన లక్షణములూ అవసరం లేకుండానే ఆడెదరు. ఆటకాండ్లు తమ పిడికిలిని గట్టిగా పట్టుకొనెదరు

[illegible] కట్టుకొన్నాలె [illegible]. [illegible]
కొని కోతులను అనుకరించే విధంగా నాట్యము చేసెదరు

ఆడపిల్లఆట లేక బోగంవారి ఆట:— స్త్రీల మోహమునకు సంబంధించిన కృత్యములు కన్నుల గట్టినట్లు ఈ యాటలో చూపబడును. పురుషులాడే ఆటలో స్త్రీలు పాల్గొనుటకు నిషేధింపబడును. పురుషుల ఆటలో ఎక్కడను గూడా పురుషుడే స్త్రీ పాత్రను ధరిస్తాడు. [illegible] చీరెను ధరిస్తాడు. లేదా మేకతోలును చేతుల కింద [illegible] లో చుట్టుకుంటాడు. ప్రియుని వేషమును ధరించినవాడు అతని పదునైన ఒక కత్తినీ బట్టను చేతిలో ఉంచుకొనును. కొన్ని వేళలలో చాపలు అల్లే జనుపచీరను [illegible] కట్టుకొనును. ఇట్లు చేయడంచేత అతడు [illegible] పూర్వీకుల వేటకాండ్లు చాలా పొడువుగానున్నట్లు గుర్తింపజేయును. ఈ నాట్యము నాట్యమస్థానంలో ఆరంభమగును. ఆ నాట్యస్థానంలో స్త్రీ వేషధారి రెండుమూడు అడుగులు నడుస్తూ ప్రియుని యొక్క ప్రతిచర్యకూ వ్యతిరేకభావాన్ని కనుపరుచును. అయితే ఆ యాటలో వాద్యము వేగంగా వాయించేకొలదీ నాట్యకాండ్లు ఉద్రిక్తులయ్యెదరు. వారి మధ్యనుండే చోటు గూడా క్రమంగా తగ్గుతూ చివరకు ఒకరి నొకరు [illegible]ంచి పట్టుకొనబోయేదాకా అగును. సాధారణంగా ఈ విషయంలో స్త్రీయే ముందంజ వేయడం జరుగును. ఆమె తన ప్రియుని తొలుత ముద్దాడును. అతని ముఖమునూ శరీరమును మోహాంధ్య చర్యలతో ముద్దాడుచు [illegible]ంచును.

భాగంవారి ఆటను అలాగే యింకా ఆడుట, లేక అందులో మార్పు కలిగించుట అనేది మరియొక నాట్యము. అది వివాహసంబంధమైన అసూయకు సంబంధించిందని చెప్ప బడినది. ఈ నాట్యంలో వాడే పనిముట్లుగూడా పూర్వపు నాట్యంలో వాడేవే కాని సాధారణంగా ఈ యాటలో భార్యకై చీరెను ధరించును. భార్యాభర్తలు క్రిందికి మీదికి ఊగుతూ ఆడెదరు. కాని భార్య భర్తతో ఆడేటప్పుడు ఆ సమాజంలోని తన ప్రియుణ్ని చూస్తూవున్నట్లుగానూ చూచి మోహంపుచేష్టలు చేస్తూవున్నట్లుగాను నటించి ఉత్సాహం కలిగించుటకు ఎక్కువ ప్రయత్నాలు చేయును. ఆ మెనటనలు ప్రేక్షకులకు ఉత్సాహకరంగా ఉండును. భార్య ప్రవర్తనపై భర్తకు కోపంకలిగేకొంది ఆమె తాను చూస్తున్న పురుషునిపైననే తనదృష్టిని తీవ్రముగా సారించును. అయితే కాకాయే ప్రియుడు తనభార్యను తాకిన పుడు నాట్యశాఖు వెంటనే అతనిపైబడి తరుమును. ఆ తెన్నాడుట కొంతసేపుదాకా జరిగినపిదప ఒక పెద్దమనిషి వేషధారి నాట్యరంగంలో ప్రవేశించి భార్య వేషధారిని పట్టుకొని అతని సిగ్గుమాలిన దుష్ప్రవర్తనకు దండనరూపంగా ఆమె ధరించిన వస్త్రములను ఒలుచును.

భాగంవారి ఆటువంటి నాట్యములలోని ముఖ్య నటులు నాట్యరంగంలో మాత్రమే నటించరు. వారు ఇతర నాట్య శాలల్లో పాటుగూడా కలిసి నాటకములాడెదరు. వారు

యితరులతో కలిసి ఆడేటప్పుడు ఎవరు ప్రియుని వేషమును ధరించవలెను. ఎవరు పెద్దమనిషి వేషమును ధరించవలెను అనే యేర్పాట్లు లోలుతనే చేసుకోరు.

ఈ నాట్యంకన్నా కొద్ది భేదముగల నాట్యముగూడా వారు ఆడెదరు. దానిపేరు గుమ్మడికాయ ఆట - (నేలనాట్యము) ఈ యాటలో ఒకమనిషి వెంట్రుకలకు ఒక గుమ్మడికాయ అతని వీపుపైన వ్రేలాడేలాగు ఒకదారంతో కట్టబడి యుండును. మరియొకడు అతనిని వెంటాడుతూ ఆ గుమ్మడికాయను ఒక పొడుగాటి కట్టతో పగులగొట్టుటకు ప్రయత్నించుచుండును. గుమ్మడికాయ కట్టుకున్నవాడు గుంపులో దూరుతూ, ఇతర నాట్యకాండ్లతో కలిసి తప్పించుకుంటూ, తన తలనూ చేతులను త్రిప్పుతూ, ఒకవైపునుండి మరియొకవైపునకు గంతులు వేయుచూ తనను వెంటాడువానిని తప్పించుకొనుటకు సాధ్యమయినంత ప్రయత్నము చేయును. వెంటాడువాని దెబ్బలు తరుచుగా తప్పిపోయి యితరనాట్యకాండ్ల పైన పడుచుండును. అయితే, ఈ హాస్యములలో ప్రేక్షకులకు విశేషంగా వేడుక కలుగుటయేకాక వారు నాట్యకాండ్లకు పెద్దపెద్ద నినాదములతోనూ, ఉల్లాసకరములైన ధ్వనులతోను ఆనందమును కలిగింతురు.

భాగం చేరగానే వారందరూ తమ తలను పైకి ఎత్తకొని ఒక్కొక్కరిగా చక్రాన్ని విడిచిపెడతారు. వారు నాట్యం చేసేటప్పుడు వారి చేతులు ఒక వేగంగా కదులుతూ చాపుతూ ఎడ తెగకుండా అలాగే తిరుగుతూ వుంటారు. ఆతర్వాత వారందరు తిరనకరు సవ్యంగా తమ పూర్వం ప్రారంభించిన చోటికి తిరిగి చేరి పూర్వం వలెనే వలయాకారంలో నాట్యం చేయుటకు ఆరంభిస్తారు. ఆ నాట్యంలో వారు నడుమును కొద్దిగా వంచి వుంటారు. ఆ విధంగా వుండియే ముందుకు చాచబడిన చేతులను క్రిందికి వంచుతూ లేక పైకి ఎత్తుతూ ఆడెదరు. చేతులను ఆడించడంలో మణికట్టు వ్రేళ్ళు గూడా చమత్కారంగా ఆడుతూ వుంటాయి. ముందుకు, పక్కలకు, తిరిగి ముందుకు, ఈ విధంగా అడుగులు వేస్తూ నాట్యం చేయుటకు మరల ఆరంభించెదరు. వారి కాలి అందెల గల్లుగల్లుమను శబ్దము నాట్యపు పాటకు ప్రత్యేక వాద్యమువలె వుండును.

మాథూరా స్త్రీల నాట్యము కూడా ఆకర్షణీయంగా వుండును గాని మాథూరా పురుషులు అసలైన రాజపుటానా వైఖరిలో దుస్తులు ధరిస్తారు. తెల్లని షేర్వానీలు, అందమైన రంగులుగల తలపాగాలు ధరించి సాధారణంగా ఎరుపు రంగు గలిగిన ఆరు అంగుళముల వెడల్పుగల రంగుపట్టాను నడుముకు చుట్టుకొని యుంటారు. మెడలో ఒక పూమాల ధరించి యెడమచేత పట్టు చేతిరుమాలు, కుడిచేత ఒక చిన్న బెత్తము ధరించియుంటారు. ఈ విధంగా వారి దుస్తులు

వేషము అమరియుందును. వారు కూడా పైన చెప్పిన నాట్య సంకేతమునే అనుసరిస్తారు. వారు గుండ్రముగా నిలుచుకొని నాట్యం చేసిన తర్వాత ఆ విధంగానే నడిచేటప్పుడు వారి చేతి కోలను ప్రక్కవాని చేతి కోలకు కొట్టుతూ వుంటారు.

కొన్ని బంజారానాట్యపు పాటల అర్థము ఈ క్రింద చూపబడినది,

**లంబాడాలపాట:-**

౧. లంబాడాలు సాధారణంగా దసరా ఉత్సవాల సందర్భంలో ఈ క్రింది అర్థముగల పాటలను భవానీదేవి స్తోత్రరూపంలో పాడెదరు.

ఓ అమరగిరిరాణీ భవానీ మేలుకొనుము,
సూర్యచంద్రులు, లక్ష నక్షత్రాలు
నిన్ను సేవిస్తున్నవి
గంగాయమునలు నీ యొద్దనున్నవి
నీవు ప్రేమస్వరూపిణివి, మాతృస్వరూపిణివి.

౨. భవానీదేవి స్తోత్రరూపమైన యీ క్రిందిపాటను ఎవరైనా స్ఫోటకం జబ్బులో పడి ఉన్నప్పుడు పాడెదరు.

ఓలుకడియా పొమ్మా
నేను తుల్జాభవాని యని జ్ఞాపకముంచుకొమ్మా
తుల్జాశిశువు తొట్లెలో ఏడుస్తూన్నది
ఓ తల్లీ వేపకొమ్మతో వీచుము
ఓ మాతా నెమలియీకెలతో వీచుము

౩. ఈ క్రింది పాటను బీదలకు అన్నదానం చేటప్పుడు బాలాజీ శ్రీ తిరుపతి వెంకటేశ్వర్ల స్తోత్రరూపంలో లంబాడాలు పాడెదరు.

"సర్వశక్తిమంతుడైన ఓ బాలబ్రహ్మచారీ, బాలం
నీ పర్వతంపైన వుండేవి ఏమిచెట్లు ?
ఇవి శ్రీగంధపు చెట్లు
ఈ చెట్లగంధము భగవంతుడైన బాలాజీ ముఖమునకు
పూయబడును.
ఇంతేగాక హాథీరాంజీముఖమునకుగూడ పూయబడును"

హాథీరాంజీ అనే భక్తుడు మొట్టమొదలు తిరుపతి వెంకటేశ్వర స్వామిని తిరుపతి కొండపైన ప్రతిష్ఠించి ఆ దేవుని యాలయములో శాశ్వత దివ్యజ్యోతిని వెలిగించినవాడు. ఆ భక్తునికి వెంకటేశ్వరస్వామి ప్రత్యక్షంగా ఉండెనట. అతనితో పాచికలాడేవాడట. ఆ హాథీరాంజీ లంబాడా ౧౨ గోత్రాలుగల పామర్ అనే శాఖలో పుట్టినవాడట. కనుక లంబాడాలు తమ గోత్రీకుడై తిరుపతి వెంకటేశ్వరస్వామికి అంతరంగభక్తుడైన హాథీరాంజీని స్తోత్రముచేసెదరు. లంబాడాల ౧౨ గోత్రములు ఏవియనగా:— (౧) ఐయత్ పామర్, (౨) చిత్ పామర్, (౩) లోకపామర్, (౪) బామిపామర్, (౫) ఖర్బసీపామర్, (౬) మూంజసీపామర్, (౭) విజ్ఞవత్ పామర్,

(౯) అంగోత్ పామర్, (౯) ఝర్లావ పామర్, (౧౦) సూన్ సవత్ పామర్, (౧౧) ఇంజ్రివత్ పామర్, (౧౨) వంకడోత్ పామర్.

౪. లంబాడాలు హోలీపండుగ సందర్భంలో ఆడే కోలాటంలో యీ క్రింది అర్థముగల పాటపాడుతూ ఆడెదరు.

ఓ సామియా యువకుడా
నీకు తల్లి దండ్రులున్నారున్నారు
ఓ యువకుడా ముక్కుపోగు తెమ్ము
అవిచాలా వెలగలదిగానూ, అందంగానూ ఉండవలెను
ఆ ముక్కుపోగు ధరించినతర్వాత నేను నీవెంటవచ్చెదను
నా పసిబిడ్డను, ముక్కుపోగును ఊచుకుంటూ నీవెంట వస్తాను
ఓ ప్రియుడా నిన్ను నేను చాలాచాలా ప్రేమిస్తున్నాను.

౫. ఈ క్రింది అర్థముగలపాటను పండుగలలో చేసే నాట్యంలో లంబాడాలు పాడెదరు.

మేము మొట్టమొదట దేవుని పేరును స్మరించి పాడెదము.
మేము భూదేవి పేరును స్మరించి పాడెదము.
మేము తండ్రి పేరును స్మరించి పాడెదము.
మేము తల్లి పేరును స్మరించి పాడెదము.

మేము నాయకుని పేరును స్మరించి పాడెదము.
మేము శివభయ్యా పేరును స్మరించి పాడెదము.
మేము దండియార్రో పేరును స్మరించి పాడెదము.

గమనిక:- దండియార్రో అనేది లంబాడాల దేవత పేరు.
ఆ దేవతను మియారామా అనికూడా అంటారు.

౬. దసరా సందర్భంలో లంబాడాలు ఈ క్రింది అర్థముగల ఒక పాటను పాడెదరు.

గ్రామంలో వున్న ఓ చింత చెట్టులారా మీరు
నగారాలధ్వని విన్నారా ?
ఓ తండ్రి నగారాలు నీ పేర వాయింపబడుతున్నవి
నీ నాయకత్వపు వెల నా కంఠహారపు వెలతో సమాన
మైనది.
గ్రామంలో వున్న ఓ చింత చెట్టులారా మీరు నగారాల
ధ్వని విన్నారా?
ఓ సోదరా నగారాలు నీ పేర వాయించబడుతున్నవి
నీ నాయకత్వపు వెల నా ముక్కుపోగు వెలతో సమాన
మైనది
గ్రామంలో వున్న చింత చెటులారా మీరు నగారాల
ధ్వని విన్నారా ?
ఓ తల్లీ నగారాలు నీ పేర వాయించబడుతున్నవి,
నీ నాయకత్వపు వెల నా గాజుల వెలతో సమానమైనది.

౭. లంబాడాలు బతకమ్మ ఉత్సవాలలో ఈ క్రింది అర్థముగల పాటను పాడెదరు. దీనికి బత్కమ్మ పాట అని పేరు.

ఓ గోధుమ మొక్కలారా, మీరు లంబాడీ మొక్కవలె
పెరుగండి
శివభయ్యా తీజ్ మొక్కనునాటినాడు బాలికలు దానికి
నీరు పోసినారు
దండియాడీ తీజ్ మొక్కను నాటినాడు, బాలికలు
దానిని పెంచినారు

(మియారామా అనే దేవతకే దండియాజీ అని కూడా పేరు.)

౮. పెండ్లిపాటః- లంబాడాలలో మొట్టమొదటి సారి పెండ్లికూతురు ఆమె భర్తయింటికి పోయేటప్పుడు యీక్రింది అర్థముగల పాటను పెండ్లికూతురు, ఆమెవైపు బంధువులు పాడెదరు.

మాతండ్రి యిల్లు పరమానంద పరిపూర్ణమైనది
ఓ నా ఆనందకరమైన గృహమా, నా తల్లిదండ్రులు
నేడు నాకు వీడ్కోలు నిస్తున్నారు, నన్ను నీవు ఎప్ప
డుకూడా మరచిపోవద్దని ప్రార్థించెదను.
ఓ నాతండ్రిగృహమా! నేను నీముందునిలబడి ధ్వనిస్తే
నీవు వెనికినుండి వింటావు;

నాతండ్రి యింటియొక్క ఒకతలుపును నేను తెరిస్తే
వెండిబంగారములు బయటికి ప్రవహించగలవు;
ఆ యింటి రెండవతలుపును తెరిచినానంటే నేను
కోరిన వస్తువులన్నీ పడయగలను.

౯. లంబాడాలలో పెండ్లికూతురు ఆమె భర్త యింటికి పోయేటప్పుడు యీ క్రింది అర్థముగల ప్రార్థనా రూపమైన పాటను పాడును.

"ఓ తండ్రీ! నేను పోతున్నాను, నేను పోతున్నాను;
ఓ తండ్రీ నేను పోతున్నాను, నేను పోతున్నాను;
మాతండ్రి వేపచెట్టువలె వర్ధిల్లుతూ అతనియిల్లు ఎల్లప్పటికీ పరమానందభరితముగా ఉండుగాక;
మాతండ్రి ప్రియమైన గృహము అభివృద్ధికరమైన మఱ్ఱిచెట్టువలె పెంపొందుగాక;
సావుకార్లు ఎల్లప్పటికిన్నీ మా తండ్రియింటితో లావాదేవీ సంబంధము కలిగియుందురుగాక;
అడవిలో పెరిగే పచ్చగడ్డివలె నాశరహితంగా మా తండ్రి యిల్లు పెరుగుతూ వుండునుగాక;
మా తండ్రి యింటి ధాన్యపుగరిసెలో ఒక్కొక్కగింజ కోటిగింజలుగా మారుతూ అభివృద్ధి జెందునుగాక."

# సంఘ నాట్యపు గానము

" ఓ బంజారా మంచి నాట్యము ఆడితిమి;
ఓ బంజారా బాలికలు మంచినాట్యము ఆడిరి;
బంజారాలు చాలా శ్రేష్ఠ మైన నాట్యము ఆడిరి;
బంజారాలు వచ్చి యీ యానందమును తెచ్చిరి;
ముక్కుపోగును తెచ్చి ఆనందము కలిగించిరి;
ఓ బంజారా బజారులో మంచి నాట్యము ఆడితిమి;
ఓ బంజారా నగరంలో మంచి నాట్యము ఆడితిమి;

---

దివ్యవాణి పత్రికవారి శ్రీనివాసా ప్రింటింగువర్క్సు సికింద్రాబాదు.